శ్రీ వేంకటరమణాయ నమః

8/5-2-14
1920-21

శుభమస్తు.

రఘుపతిరాఘవ్యము.

శా. శ్రీకల్యాణగుణాశ్రయంబు విజయశ్రీదేవికిం బ్రాపు శ్రీ
కాకుస్థాన్వయదుగ్ధవారిధికి రాకాపూర్ణచంద్రోదయం
బాకైవల్యసుఖంబు సజ్జనటికా సద్వృత్తిశీలోత్తంసమై
సాకేతంబున నొప్పు దాశరథి శశ్వత్ప్రేమ నన్బ్రోవుతన్.

వ. కృత్యాదిని రచియింపఁబడిన యీపద్యము శుభకరమగునదిగాఁ దెలియుటకు నీక్రింది లక్షణము చూపింపఁబడుచున్నది.

శ్లో. దేవతావాచకాశ్శబ్దా యే చ భద్రాదివాచకాః
తే సర్వే నైవ నింద్యాస్స్యుర్లిపితో గణతోపి వా.

టీ. దేవతావాచకాః భగవద్వాచకములయిన, శబ్దాః శబ్దములు, యే ఏవిగలవో, భద్రాదివాచకాః మంగళవాచకములయిన వివేవిగలవో, తే సర్వే ఆ సకలశబ్దములు, లిపితః లిపివలనను, గణతోపివా యతిగణప్రాసాదినియమములవలనను, నింద్యాః నిందింపఁదగినవి, నైవస్యుః కానేకావు.

వ. కనుకనం బేతద్వృత్తఘటిత ప్రథమవిశేషణంబగు శ్రీకల్యాణగుణాశ్రయంబనెడి శబ్దమునకు దాశరథిగుణాభివర్ణకత్వేన దేవతావాచకత్వమును శ్రీకల్యాణయను ఉపలనమాంగళ్యవాచకత్వమునుం డుటచేత నీకృతి లక్షణలక్షితమయి యొప్పునని యెఱుం

ప్రారంభాధ్వర దీక్షితుండగు జగత్ప్రాణాత్మకున్ హంసఁ గొల్చెదన్.

ఉ. శ్రీకమలోద్భవాండముల జెన్నుగ నానెడి రాజహంసమై
లోకములందుఁ గ్రాలు వెలుంగు వెలుంగుల కాదిమూలమై
మాకుఁ బరార్థబుద్ధులను మానుగ నిచ్చెడి మేటి వేల్పునై
శ్రీకర హంసమండల సుసీమను వెల్గెడు శ్రీరమాధిపున్
శ్రీకలితత్రిపాదము సుచింతన చేసి హృదిని ల్మిత్యు కొల్చెదన్.

టీ. శ్రీః: ప్రకృతిస్వరూపమయిన, కమలోద్భవాండములన్: బ్ర
హ్మాండములను. జెన్నుగను: చెన్నగాను, ఆనెడు: కనెడు
రాజహంసమై, రాజః: స్వప్రకాశమయిన, హంసః: హంతి సర్వ
త్ర గచ్ఛతీతి హంసః. అనువ్యాప్తి వలన సర్వాంతర్యామి
యగు పరమేశ్వరుఁడయి, లోకములందున్: భువనములందు
గ్రాల ప్రభువి భ్రాంతి: విలాసములచేత వెలుంగు: ప్రకాశిం
చు, వెలుంగులకున్: హరిహర హిరణ్యగర్భేంద్రాది ప్రభుకోటికి
ఆదిమూలమయి: ఆదికారణమయి. మాకున్: ఉపాసనఁ జే
సెడి మాకు పరార్థబుద్ధులన్: బ్రహ్మజ్ఞానబుద్ధులను
మానుగన్: ప్రాజ్ఞ్యతఁ గలుగునట్లుగా. ఇచ్చెడి: ఇచ్చునట్టి,
మేటి వేల్పునై: గొప్ప దైవమయి. శ్రీకర: శోభాకరమయిన
హంసమండల: సూర్యమండలము యొక్క సుసీమను: సుప్రదేశ
మందు. వెలిగెడు: తేజరిల్లుచున్నట్టి. శ్రీరమాధిపున్: శ్రీమన్నా
రాయణమూర్తిని. శ్రీకలిత: ప్రకాశముతోఁ గూడిన. త్రి

త్రిపదా గాయత్రీ యను స్మృతి వలన బ్రాహ్మణ ధర్మ గాయత్రీ మంత్రానుష్ఠానము చేత. హృది: హృదయమునందు. నిత్యా: నిత్య కాని ఐశ్వర్యదన: నమస్కరించెదను.

గాయత్రీ మంత్రార్థం బెట్లనిన. సవితుః సూయతే ఇతి సవితా. ఘుష్ః ప్రాణిప్రసవే అను వ్యుత్పత్తి వలన సవితృశబ్దమునకు సృజించువాండని యర్థము. దేవస్య: దివ్ క్రీడాయాం అను వ్యుత్పత్తి వలన బ్రహ్మాండ స్థిత భువనముల యందు ప్రభువి భ్రాంతి విలాసముల చేత క్రీడలు సల్పుచున్న హరిహర హిరణ్యగర్భేంద్రాది రూపవిశేషము కలవాండని యర్థము. వరేణ్యం: ఉపాసకులమయిన మాంకు ధియః: బ్రహ్మజ్ఞానబుద్ధులను. ప్రచోదయాత్: కలుగఁజేయువాండనుటి. ఇటువంటి. యః: ప సూర్యమండలాంతర్వర్తియయిన శ్రీమన్నారాయణ మూర్తి, గలఁడో ఆయన యొక్క వరేణ్యం: తెలియఁదగిన; తత్: ప్రసిద్ధమయిన. భర్గః: తేజో విశేషమును ధీమహి: ధ్యానము చేయుచున్నాము. భర్గశబ్దమునకు హరితేజో విశేషము అర్థమనునందులకు చతుర్ముఖుండు యాజ్ఞవల్క్యుతో:-
"భర్గస్య దాఖ్యాం భజనీయమేకం ధ్యాయామి నిత్యం రవిమండలస్థం" అను నిత్యాది ప్రమాణము వెలింగించనట్లు సావిత్రీభాష్యము బోధించుచున్నయది.

దండాన్వయము:- బ్రహ్మాండముల సృజించు నటువం

టియును, ప్రభువిభూతి విలాసములచేతఁ గ్రీడించు
చున్న హరిహర హిరణ్యగర్భేంద్రాది రూపభేదములుగలిగిన
యువంటియును పొసఁగులమయిన మాంసు బ్రహ్మజ్ఞానబుద్ధు
లను గలుగఁజేయునదియువంటియునే సూర్యమండలాంత
ర్వర్తియయిన శ్రీమన్నారాయణమూర్తి గలఁడో యాయన
యొక్క కొనియాడఁదగిన ప్రసిద్ధమయిన తేజోవిశేష
మును ధ్యానము చేయుచున్నాము.

సీ. తొలిమనువుల దాఁక తలఁపుంచెనెవ్వఁడు?
తరికొండ వేళ్ళనుఁ దాల్చెనెవఁడు?
దనర భూమిని కొమ్మునానిన నైత్తెనెవ్వఁడు?
దనుజబాలునిఁ గృపమనిచె నెవఁడు?
మూఁడడుగుల నేల ముల్లోకమెవ్వఁడు?
తండ్రికై క్షత్త్రరాజులఁ దఱిగె నెవఁడు?
సతికై యతరి దైత్యపతిఁ గూల్చె నెవ్వఁడు?
ముసలియయి బలుఁదనిఁ బొసఁగె నెవఁడు?
బౌద్ధుఁడనఁ గల్కియనఁ గను బరగె నెవఁడు?
నతని బ్రహ్మాండ పాలనాంచిత విహార
నములు నవ్యయు నఖిలాత్ము నప్రమేయుఁ
దలఁతు నారాయణుని చిత్తమలర నెపుడు.

మ. సరిగా నెవ్వని రోమకూపములన లక్షల్లకోట్లనంతంబులై

గరిమం బెంచుచు రెప్పపాటులోఁ జటనెదు మార్గంబుఁ జొప్పగిల్లింపుచుం
గురువై ప్రేమ పరాత్పరేశు హరి నిన్ గోవిందు నిన్ గొల్చెదన్.

సీ. విజయధ్వజము మింట వెలయఁ జేయుటె గాదు
ప్రణవనాదవినోదపటిమ నెరపు
నతిదైత్యశిరముల నరసి గూల్చుటె గాదు
నిలపవిత్రసుతీర్థముల నొసంగు
రణవిజృంభణవృత్తి రహిఁ బహించుటె కాదు
ప్రణతసంరక్షణ ప్రభల మించు
శత్రుహృద్భేదియై జగతి నొప్పుటె గాదు
ధర్మమార్గనిరూఢి దనరఁ జేయుం
భళిర! శ్రీహరి చేతులందుఁ బట్టిన యట్టి
శంఖచక్ర గదా శార్ఙ్గ సముదయంబు
శత్రుజయమును హరిభక్తి సాంద్రమై శ్రీ
నమరఁ జేకూర్చి ప్రేమ ననర్ఘ మొప్ప

గీ. భగవదిచ్ఛ యనఁగ బ్రహ్మశక్త్యనఁగను
ప్రత్యగీశ్వ చైతన్య భద్రదాయి ~~[illegible]~~
ననఁగ నొప్పు సత్త్వయానంద పద క్షేల
మైన లక్ష్మి నాత్మలోనఁ దలఁతు.

౮ శా. శ్రీకాశీపురభేదనంబు నలసచ్ఛ విహార భూతాళికై
శ్రీకంఠాఖ్య కృపాబ్ధి ముక్తి నిడు శ్రీ సత్తేశు సద్బోధ

శ్లో. శ్రీకంజాత భవాది దేవ విభునా రాజ్యాలారేయి గంగాన్వితున్
రాకా కౌముది వర్ణ శంకరుని నేఁ బ్రార్థింతు నశ్రాంతమున్.

వ. ఇందు.

ముక్తి నిడు స్తేత్రేశా సుచార గ స్థితిన్ అను సందుకుల దృష్టాంతము.

శ్లో. అహం భవన్నామ గృణన్ కృతార్థో వసామి కాశ్యా
మనిశం భవాన్యా ముముర్షమాణస్య విముక్తయేహం
దిశామి మంత్రం తవరామ ~~నా~~నామ.

టీ. అహం: నేను. భవం నామ: నీ నామమును. గృణన్:
జపించుచు. కృతార్థః: కృతకృత్యుఁడనయి. కాశ్యాం:
వారణాసి క్షేత్రమందు. భవాన్యా: పార్వతీదేవితోఁ గూడ.
ఆనిశం: ఎల్లప్పుడు. వసామి: నివసించితిని. అహం: నేను
ముముర్షమాణస్య: మృతిఁబొందుచున్న ప్రాణులకు నెుక్క
విముక్తయే: మోక్షముకై అకు: తవ: నీ యొక్క. శ్రీరా
మనామ: శ్రీరామయను నామమును. దిశామి: ఉపదేశిం
చుచున్నాను. ఇతి శ్రీమదధ్యాత్మ రామాయణే శం
కర భగవద్వచః. మఱియు శ్రుతి ప్రమాణము.

శ్రీరామస్య మనుం కాశ్యాం జజాప వృషభ ధ్వజః

టీ. వృషభధ్వజః: సాంబమూర్తి. కాశ్యాం: కాశీక్షే
త్రమందు. శ్రీరామస్య: శ్రీరామమూర్తి యొక్క

మనం: తారకమంత్రమును. జజాప: తపస్సుచేసెను.

తతః ప్రసన్నో భగవాన్ శ్రీరామస్త్వాం హ శంకర॥

టీ. తతః ప్రసన్నో భగవాన్ శ్రీ రామః: తర్వాతను భగవంతుడయిన శ్రీరామమూర్తి ప్రత్యక్షమయి. శంకరం. సాంబమూర్తినిగూర్చి ప్రాహ: పలికెను. ఏమి కోరిక నిచ్చెదనని. అథ సాంబో వాచ. అథ: తర్వాతను. సః: ఆ సాంబమూర్తి. ఉవాచ: పలికెను.

శ్లో. మణికర్ణ్యాం మమక్షేత్రే గంగాయాం వా తటే పునః

మ్రియన్తే దేహిం తజ్జంతూర్ముక్తిర్యాతు వరాంతరమ్

టీ. మణికర్ణ్యాం: మణికర్ణిక యను క్షేత్రమునందును. మమ. నాయొక్క క్షేత్రే: కాశీక్షేత్రమందును. గంగాయాం వా తటే: గంగయందును ఆతీరమందును వాపునః: పంచక్రోశమధ్య దేనియందయిన నేమి దేహి: జంతువు మ్రియన్తే: మృతి బొందునో తజ్జంతూ: ఆప్రాణి నికి. ముక్తిః: మోక్షమును. దేహి: ఇవ్వు. అతః: దీనికంటె. వరాంతరం: మఱియొక వరమును న: కోరను. ఇత్యెథ సహోవాచ: శ్రీరామః: ॥౯॥ ఇతి: ఈలాగనగ. అథ: తర్వాతను సః శ్రీరామః: ఆ శ్రీరామమూర్తి. ఉవాచ: పలికెను.

శ్లో. క్షేత్రేస్మిన్ తవ దేవేశ యత్ర కుత్రాపి వా మృతాః

కృమికీటాదయో ప్యాశు ముక్తాస్సంతు న చాన్యథా.

హే దేవేశ: ఓ సాంబమూర్తి తవ: నీయొక్క అస్మిన్ క్షేత్రే:

~~అవిముక్తే క్షేత్రే~~ కాశీక్షేత్రమునందు. ఏ(క్షే)త్రమందు హితాః: ఏకర్కడైకర్కాడనయిన నరు మృతాః: మృతినొందిన క్రిమికీటాదయోపి: పిపీలికాది సర్వజీవకోటియును. శ తత్ క్షేత్రమునందే. ముక్తాః: ముక్తులయి సంతతం: అగుదురుగాక. అన్యత్రాః: మఱి యెచటనైన. నచ: కాంచారిడు. మఱియును

శ్లో. "ముమూర్షోర్దక్షిణే కర్ణే యస్య కస్యాపి వా స్వయం
ఉపదేక్ష్యసి మన్మంత్రం స ముక్తో భవితా శివేతి

టీ. ముమూర్షోః: మృతిఁబొందుచున్న యస్య కస్యాపివా: ఎవరెవరికయిన స్వయం: నీవు. దక్షిణే కర్ణే: దక్షిణకర్ణమందు మన్మంత్రం: (బ్రహ్మ)తారకంబగు నా షడక్షరీమంత్రమును ఉపదేక్ష్యసి: ఉపదేశింపఁగలవో. సః: ఆజంతువు. ముక్తః: ముక్తిఁగలవి భవితా: కాఁగలఁడు. ఇతి శ్రీరామతారకోపని యోప్యుపనిషత్.ది.

వ. మఱియును శ్రీకాశీక్షేత్రమందు మృతిబొందిన జీవకోటి యొక్కటి లింగాకారంబయి నిలిచియుండుననుసందునుసు రాఖ్యాండేశ్వరాది కథలు దృష్టాంతంబగునని కాశీఖండంబే తెల్పింగించుచున్నయది. యిదియునుంగాక వారణాశీ క్షేత్రంబునందు ఉత్క్రమణంబునొందిన జీవసంఘంబునకు శశిశేఖరుండు రామతారకమంత్రోపదేశంబిచ్చుటవలన "త్రిపాదస్యామృతం దివి" అని శ్రుతి చెప్పుచున్నట్టివో

ష్ఠ స్థానమును బొందునని తాపనీయోపనిషద్బోధించు
చున్నయది. ఈ రెండింటిలో నిజంబెద్దియని సందియంబు నొం
దెడిజనులకు మనస్సమాధానంబు కొఱకు యుక్తినె తెలి
గింపబడుచున్నయది యెట్లనిన. స్కాందుపయిను దహరించిన
పెదవసంజ్ఞ "ముముక్షోర్దక్షిణే కర్ణే గలది)) తాపనీయ(శ్రుతి)
తియందు ఓ సాంబమూర్తీ! నా షడక్షరమంత్రమును
ఎవరెవరికి నుపదేశింపగలవో యా జీవకోటిముక్తినొం
దగలదని శ్రీరాములవారు చెప్పినట్లు చెప్పియున్నది.
అందువలన నాలోచించిన తారకమంత్రోపదేశము లేని
వారికి కాశీక్షేత్రమహిమవలన నచట శిలామయలింగా
కారమునొందగలుగునని యరు శంకరభగవంతుని కృపవలన
తారకోపదేశమును బొందినవారు త్రిపాదవిభూతిం బొందు
దురనియు "నా తత్త్వంబు కుందు కొందఱికుపదేశించకుందునా?"
యని శంకించునెడల పరమగురుండగు నాగంగాధరుండు సర్వజ్ఞుండగు
ఓ ఉపాసకుని ఉపాసనాతారతమ్యవశంబునం జేసి యే జీవునకె
ట్టి జ్ఞానర్హుండగునో యట్టి జ్ఞానర్హ్ముచుండునని యును నిశ్చయింపబడి
యెను. ఇందువలన స్కాందోక్త స్మరాణోపనిషత్తులు రెండును
క్షేత్ర మంత్రాది తారతమ్యంబులం బట్టి ఫలములనిచ్చునట్లు
నిజంబుగా నేర్పడియె.

శా. ఏ రామస్మరణ ఘుం రామనామమతిచే నింద్రాక్షి గర్భాదు తే

పారంగాంత్వైదరట్టి శాంతరిని విశార్వత్త్యైన సదానాత్త్యలా
సారూర్ధక నవరత్నపేరమున నుద్వ్యద్ధక్తిఁబూజించెదన్
సారసోదార వ్యకావ్య రచనా సంసిద్ధిగావింపఁగన్.
రామనామాంనుష్ఠానవంహిమవలన ననుసంఘతు లిట్లున్నము.

వ. శ్రీ శంకరభగవంతుండు పార్వతీదేవికి నుపదేశించిన మంత్రము.

శ్లో. శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే
సహస్ర నామ తత్తుల్యం రామ నామ వరాననే

టీ. హే మనోరమే రామే!: నాకుమనోహరురాలవయిన యోపార్వతీ! శ్రీరామరామరామేతి: శ్రీరామరామరామ యనుచు ఇర: పలుకుమా. హే వరాననే! రామనామము సహస్రనామ తత్తుల్యం: శ్రీహరిసహస్ర నామములతోటా సమమయినది.

ఇట్లుపదేశించి శ్రీరామమూర్తిని పరబ్రహ్మముగాఁ దెలిసికొనుమని బోధించుచున్నాఁడు.

శ్లో. జానీరామం ప్రభుం విష్ణుం మహాంతం పరమేశ్వరమ్ ఇతి.
బ్రహ్మయామలే గౌరీమహేశ్వర సంవాదే మహేశ్వరవచః.

టీ. పార్వతీదేవీ! రామం: శ్రీరామమూర్తిని విభుం: ప్రభువైనటువంటియు విష్ణుం: శ్రీమహావిష్ణువునుగా జానీః తెలుసుకొనువాఁడవు అస్మి: అయితిని. నీవు ను ఆరీతిని దెలిసికొని సేవింపుమా యని తెల్పెను.

మ. హరిపాదాంబుజమంధుఁబుట్టి భవభవ్య శ్రీజటాఘుంబున

దిరుపాప్రారగఁజాంచ్చి లోకములు మూఁడింటింబవిత్రంబుఁజే
యుంగహిరిఁ వెల్లన జాలు గంగ త్రివిధంబై యొప్పు మందాకిని
చరణద్వంద్వము నాత్మలోఁ దలఁతు నిష్టార్థానుసంధానుఁడై.
మ. దశరథరామసహస్రనామనుతిచే ధాత్రిం దువెప్పావినిం
పెనయంగాల్చురు విఘ్నవిఘ్నముస్నై యేపారనే నాగజా
నను విఘ్నౌఘ విదూరు సర్వసకలానందాను సంధాను స
ద్ఘ్న విద్యాత్మియ దేవునిఁ దలఁతు హృత్పంజాత పద్మంబునన్.
వ. రామసహస్రనామగరిమన్ అనునందుకు దృష్టాంతము.
శ్రీగణాధిపతికిఁ జుట్టుకొనిన బ్రహ్మహత్యానిచయంబు రామస
హస్రనామపఠనంబు నంజేసిన శించి లోకత్రయపూజ్యతగ
లిగెనని చెందుతంగారిక.

పురాణం గజరూపేణ అనేడి శ్లోకము మొదలుకొని పది
రెండు శ్లోకములచే సనత్కుమార గణాధిపతి సంవాదంబుగా
లింగపురాణంబునందుఁ జెప్పంబడియెనది యెట్లన, బ్రహ్మహ
త్యాబారిపడుకను సులభోపాయంబెద్దియని యడిగిన సనత్కు
మారుని తో గణాధిపతి యిట్లనియె.

పూర్వకాలంబున తాను సర్వతేజోపమానంబగు గజరూ
పంబుతో నుదయించి మదయుతుండయి వృక్షంబులం
గొని యనేకముని సంఘంబుల వధింప బ్రహ్మహత్యాస
హస్రంబులు నాలపాతకంబులట్లు జుట్టుకొని మృతిబారిందె

నట్లు బరువైనఁ దనజనకులందు తనదురవస్థను సహింపనొల్లక
నిష్టదైవంబగు శ్రీరామభగవంతుని బ్రార్థింప నమ్మహావిష్ణుండు ప
త్యక్షంబు వెల్వడనియు నంతట తనజనకులందు మృత్యువునియట్లు
నేలనబడియున్న తనను శ్రీరఘువరునకుంజూపి యితనికిఁబ్రా
ణంబులొసఁగి రక్షింపవేయని కోరిన నద్ధరణీసుతావల్ల
భుండు తనను రక్షించునంతనే తాను తెలివినొందియనేక
గద్యపద్యంబులచే నాశ్రీరామపరమేశ్వరుని సన్నుతింపనప్పుడు
తనను భక్తునిగాఁ గ్రైకొనియె ననియు నేనిమిత్తశ్లోకంబులచేఁదె
లిపెండియు నాదాశరథి కరుణించిబోధించిన విధంబున
నిట్లనియె. శ్రీరామః : శ్రీరామమూర్తి.

శ్లో. బ్రహ్మహత్యా సహస్రప్రాయశ్చిత్తం వదామి తే
యోరామన్నామ సహస్రం తే హంత్యా కోట్యా వినశ్యతి.

టీ! బ్రహ్మహత్యా సహస్రశ్చ : అనేకసహస్ర బ్రహ్మహత్యలకు
ప్రాయశ్చిత్తమును కొఱకు వదామి : ఉపదేశించుచున్నాను.
యోరామన్నామసహస్రం చేద్ధత్యా కోట్యా విముచ్యతే
టీ! యః : ఏ జనుఁడు. మన్నామసహస్రం : నాయొక్క సహస్రనా
మములను చేత్ జపించినట్లయితే సః : వాఁడు కోట్యాః : కోటి
సంఖ్యగల హత్యాః : బ్రహ్మహత్యలనుండి. విముచ్యతే : విడువఁ
బడుచున్నాఁడు.

శ్లో. ఇతిమహ్యంతదా రామస్యాస్య నామసహస్రకం

తస్య గ్రహణమాత్రేణ నిష్పాపోస్మి తథైవహి.

టీ. ఇతి ఈలాగని తదా. అప్పుడు రామః: శ్రీరామమూర్తి మహ్యం: నాకు ఆతడు స్వస్య. తనయొక్క నామసహస్రకం: సహస్ర నామములను. దదౌ. ఉపదేశించెను. అహం: నేను తస్య-ఆరా మసహస్రనామముల ~~యొక్క నా~~ యొక్క గ్రహణమాత్రేణ ఉపదే శమాత్రముచేతను. తథైవ: ఆలాగే నిష్పాపః: పవిత్రుడను అస్మి: అయితినిగదా.

శ్లో. తదాదిసర్వదేవానాం పూజ్యోస్మి మునిసత్తమ
త్వమప్యత దధీయానో రాఘవస్య మహాత్మనః
నామ్నాం సహస్రం రామస్య ప్రఖ్యాపయ మహామతే

టీ. మునిసత్తమ: ఓ మునిశ్రేష్ఠా తదాది: అది మొదలు కొని అహం: నేను సర్వదేవానాం: సకలదేవతలకు. పూజ్యః: పూజార్హుడను అస్మి: అయితిని. త్వమపి. నీవును మహాత్మనః: మహానుభావుడయినటువంటియు. రాఘవస్య: రఘువంశమునందు బుట్టినటువంటియు రామస్య: రామమూర్తియొక్క నామ్నా: నామములయొక్క అత్ర: ఈ సహస్రం: సహస్రమును అధీయానః: ఉపదేశమును బొంది మహామతే దివ్యజ్ఞానముగలవాడవయి ప్రఖ్యాపయ: ది నినందరికి దెలియజేయుము ఓ సనత్కుమారః.

శ్లో. ధన్యోస్మ్యనుగృహీతోస్మి కృతార్థోస్మి గణాధిప

త్వ(త్ప్ర)సాదాన్మయా జ్ఞాతం రామనామ సహస్రకం

ఇతి విజ్ఞాప్య దేవేశం పరి(క్ర)మ్య (ప్ర)ణమ్య చ

టీ. సనత్కుమారః : సనత్కుమారుండు పలికెను. హే గణాధిప! ఓ గణాధిపతిస్వామి అహం. నేను ధన్యోస్మి గొప్పవాండనయితిని. అనుగృహీతోస్మి. మీ కటాక్షమునకు పాత్రుండనయితిని. కృతార్థోస్మి: సకల సత్కారము గలవాండనయితి. త్వ(త్ప్ర)సాదాంత్ త్వత్. నీయొక్క (ప్ర)సాదాత్: (ప్ర)సాదమువలన మయా: నాచేతను రామనామ సహ(స్ర)కం. (శ్రీ)రామనామసహ(స్ర)ము. జ్ఞాతం: తెలిసికొనబడ్డది. ఇతి: ఈలాగున విజ్ఞాప్య. విజ్ఞాపనచేసి. దేవేశం. గణపతిస్వామిని పరి(క్ర)మ్య: ముట్టూతిరిగి (ప్ర)ణమ్యచ: నమస్కరించి వెళ్లెను (శ్రీ)సాంబమూర్తి పార్వతీదేవికి బోధించెను. ఇతి (శ్రీ)లింగపురాణే ఉమామహేశ్వర సంవాదే (శ్రీ)రామనామ సహ(స్ర)కథనం నామ సప్తశతతమోధ్యాయః

మ. హరినాభీకమలంబునన్నాదఖి విద్యాభామినిన్గాంచియుం
హరిదివ్యాజ్ఞ శిరంబునందమర నుద్యత్ప్రౌఢతన్నించి (శ్రీ)
కరలీలన్ బహుజన్మాంతసంఘములచేదృగ్ జేసియుందారిది ది
గ్వరవర్గంబు నుతింపనాహ్వం నజుని న్వర్ణింతు నిష్ఠార్థినై

ఉ. వాదజనాళికి న్నభయ వర్ణితభక్తి సుబోధకోటికి
స్వాదరవెుప్పని క్షయము-నారసి యిచ్చె ఖవాణి పద్యప

త్రైలోదయు రాణిశంబరగణోజ్జ్వలవేణి సరోజపాణిస

న్మోదముతోడ నాహృదయదినమున స్వగతి న్నటియించుగావుతన్

సీ. ఏ ఘను మహాత్మ్య నితమివి నతులాంధిపు నామ

వర్ణమయంబులు వన్నెదనరె

నేఘన ప్రాలింగాంగ మే ప్రొద్దు రఘువీరు

నందు విలీనమయి యుండ వెలిఁగె

నేరమ్య శీలుని కారణాంగ దేహ

ముద్బ్రాయు పరమేశు నందుఁగలసె

నే నిర్మలాత్ముని మానిత్యజ్ఞానంబు

శ్రీరామ తత్త్వ సంసిద్ధిఁ గనియె

నా సుచు బ్రహ్మాదు లెవ్వనిన నుదినంబు

నభినుతింతురు సంతోష విభవమెసఁగ

నట్టి గుణవంతు బలవంతు నమితశాంతు

నాత్మ సేవింతు హనుమంతు నతిశాంతు.

గీ. ఇంద్రముఖ దిక్పతుల నాత్మ సాంద్రశక్తి

దలఁతు నాయందుఁ గరుణించి

ధరణిఁ గల్గు పుణ్యకర్మలు చేసిన

పురుషుల నెల్ల నెంచి రక్షింబుము నుము సుదంబితముగ

గీ. ఈ శరీరమునకు హేతువయగు మహా

భూతముల నుదలఁతు నాతితముగ

ప్రాంతవృత్తి నొసఁగి పోషించె వెంకట సుందరుఁడు

భక్తి యుక్తి శక్తి పరిఢవిల్ల

మ. దళపత్ రామపరేశు నామము ననుచింతన్ దోషఘ్నంబులన్

దొలగం ద్రోసి సురాళి మెచ్చ ముని సందోహంబు మేలౌ యన

సత్కృతితోం దర్నేహము నొందరాఘవ చరిత్రంబు వాదిప్రశస్త్యంబుగా

నిలనెవ్వాఁడు రచించెనట్టి ఘనమౌనీంద్రుం, స్మదిదే వేడెదన్.

ఉ. శ్రీదనరంగ వేదములు చిత్రగతిన్ విభజించి మోక్షసం

పాదనకర్త్తమౌ శ్రుతుల భావము దోప పురాణ సంతతిన్

మోదముతోం రచించి జగము ల్వినుతింపఁగ నొప్పునట్టి

యాహ్లాదము యుక్ పరాశర వరాత్మజుని న్మది నిల్పి మ్రొక్కెదన్.

శా. శ్రీగోవిందవరుండు నిజ్గురునిగాఁ జిత్తంబులో నిల్పియే

భోగాభోగ జ్వాల హారుఁడై జనులకుం బొల్పొంద సుజ్ఞానవి

ద్యాగోప్యంబె యొసంగఁబూని భువి పరాచార్యవర్యుండె నా

యోగంబ్రష్ట శంకరుం దలఁతు విద్యోత్కర్ష్యతం జెందఁగన్

మ. హరికైంకర్య విధానమింపెసఁగ నుద్యత్ప్రేమ లోకేశ్వరిన్

స్థిరమౌ బోధమొనర్పఁగాఁ దలఁచి యేశేషాహి రామానుజా

ఖ్యరహింపై కొని భాష్యమేర్పఱచె మోక్షాధారమై యొప్పనా

పరమాచార్యుల నాత్మలోఁ దలఁతు సద్భక్తిస్థితిం జెందఁగన్.

మ. అనఘాత్మత్వము ధాత్రిపై వెలయ మధ్వాచార్యరూపంబుచే

తను ముందే పవమాని దేవుఁడతి చిత్రంబైన భాష్యంబు దా

శ్రీవత్సబిష్ణాభట్టరు
శ్రీవనితావరకుమారశేఖరుదలంతున్.

మ. ధరగంగానదిమేదినిష్ఫ్రరముమధ్యస్థాత్మపాంశీస్థలిన్
కరుణాంబ్నస్థోదంగాంచినొప్పకడం వే ర్గరామగితార్థమే
ప్రరహింగాదేశికుగా త్రిదెళ్ళకొను వేల్పాల్గా ప్లుని నా
దరతర్జబలిగైన గారఘూంసురగురుర్ భావ్యనింతునగ్రాంతముల్

క. శ్రీసురక్షకులు పవిత్రులు న
శ్రీసత్త్రితుస్సఙ పరాంల్య బిల్లోగ సంకం
శ్రీషాంశీల్యుని సాత్త్వా త్రాసలు
త్రాసలవిభురామచంద్రగురుమణిం దలంతున్.

సీ. కపిల బార్హస్పత్య గరుడ విష్వక్సేన
బలివిభీషణ శుకపరవసిష్ఠ
పుండరీకార్జున ముచుకుంద యుద్ధవ
హరిపతి గురు శౌనకాంబరీష
వామదేవ ఫణీంద్ర వసుభాష్య రుక్మాంగ
దాకౄరకుంభజో ధ్రువాత్రికథబ్
జమదగ్ని శిబ్యంగ జాబాలి కశ్యప
ప్రహ్లాద పృథు భరద్వాజ భరత
భరత లక్ష్మణ శత్రుఘ్న భద్ర దాల్భ్య
చ్యవన వరరుచి మాండవ్య సనక జనక

నారదాత్రేయ గౌతమాంగిరసాది
ముక్తపురుషుల పూతతత్త్వము ననుసరింతు.

శా. నానాభూతగణాళియందు సమతన్ నారాయణుండుండుటన్
నానాభూతగణాళి యాజలధికన్యానాధు నందొప్పుటన్
సానందోజ్జ్వలభావసిద్ధిఁ గని సదా సంపూర్ణభావంబుతో
జ్ఞానాంభోనిధి నోలలాడు బుధులన్ గాంక్షింతు మదినే వెదకన్.

గీ. పుణ్యకర్మతులొంది భువిని పొంప
కర్తృకుని దప్పి నడుచువారలఁ గతిని
పొందనేలంటి ఫలమును బోవవిడిచి
హరిని సేవించు బుద్ధిశక్తి సాత్త్వికులఁ దలఁతు.

గీ. బుద్ధిపరమాత్మరూపమయి పొసఁగు నంగ
ఏకఖిల సత్కర్మములు చేసి యలరునట్లు
బ్రోవ మని ~~శ్~~ కేలుమోడ్చి దలఁచు భువిని దివిని
దనరు సరసెలారంటి మృదుపదవనజములకును

లక్ష్యము. "తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వ
దైహికం" మహాత్మ్య శ్రీ భగవద్వచః.

గీ. శంభుని స్వయంభుల శ్రీ సోమయాజి
భాస్కరుల బ్రహ్మవంశాబ్ధిభాస్కరులను
సకల శాస్త్రప్రవీణుల ప్రకటితాంధ్ర
కవుల ధీశాలి బుధగురుకవులఁ గొలుతు

ఉ. సన్నుతిమీర నాహృదయసారసమందున నిల్పి మిన్నగన్
కమ్మనిపల్కులుప్పతిల గ్రాంథికులాదరణీయంబు మెచ్చ నా
కిమ్ము కవిత్వశక్తి మదికింపగ నిచ్చునుతింతు నా[illegible]
బమ్మెర పోతనార్యు బుధవర్ణిత సత్కవిరాజశేఖరున్.

చ. గతభవరోగసంగమున గల్గిన రాజ్యరమానుభూతితో
నతిమదమందుచున్ మరల నార్యులు మెచ్చఁగ భాగ్యవైఖరిన్
హితమతి తత్త్వబోధ గతినే మరల చెప్పుచు సాధులన్ దయా
న్వితమతి బ్రోచు భూవిభుల నిర్మల చర్యలనే స్మరింతుఁదే.

గీ. హృదయమందిరుఁడగు రాముఁ డెల్లు బలుక
నరహంబు లిట్టింపు నామది పై [illegible] ర సెల్లు
వైరాగ్యము నరింతు నిజమిందుఁ గలుగు సంగుణా
మగుణములెల్ల కర్త యాహరియె యగుచు.

గీ. శబ్దశాస్త్రజ్ఞులగువారు సాధువృత్తి
తప్పునొప్పుగ సాధింతు రెప్పుడవ ని
నట్టివిజ్ఞాధికారు లత్యనఘమతులు
గలుగ కుకవుల దుర్వృత్తి కలుగనేల?

వ. మఱియును.

గీ. ఆంధ్రులయి యాంధ్ర భాష చే నఖిలవేద
శాస్త్రతత్త్వార్థబోధసంసర్గ నలరి
కడకు నయ్యాంధ్రమును తూలకరణి బూరలెం

రరంయు నిల్ప్తి గురుద్రోహము లవనిఁగలరె ?

వ. అనియిట్లు హరిహరహిరణ్యగర్భ ప్రముఖ ముఖ్య దేవతా
వందనపురస్సరముగా గురుబుధచంద్ర బృహస్పతి నిష్ఠాగరిష్ఠా
ది సకల సత్పురుష లోక నమస్కారంబును సత్ప్రభుమణుల
కారుణ్య వచనంబును తల జనజనప్రజ తిరస్కారంబును గాంచినట్టి
మద్వంశంబు వర్ణించెద.

మ. చతురాస్యాండకటాంతపంక్తులచే సర్వజ్ఞతైశ్వర్యం
దతులానందమయాత్మతన్ దలఁప సర్వాత్ముండు ఈవతానియం
బతివేదవ్యాస సంఘములు బృహద్బ్రాహ్మణ్యైక్య క్ష్యాభావసన్నతిన్
తతతత్త్వోన్నతమో ప్రకాశమును భరద్వాజుండు నిర్వ్యాజతన్.

వ. అమ్మహానీయ చరిత్రు పవిత్ర గోత్రంబునందు.

సీ. శుభగుణాపస్తంబ సూత్రుండు తైత్తిరీ
యాఖ్య విశుద్ధ శాఖాన్వితుండు
ననఘుఁడత్రి వంశాంబుధిచంద్రుండు
వేంకటపతి బుధ విసుతుఁడు దయ
మఱియు నాతనికి సింగాంబకు వెంగళా
ర్యాయుసంధిమణికి గల్గె నతిసరమల
మతియగు వెంగాంబ కతిదయాపరమూర్తి
వెంకటపతితత్త్వవిదుఁడు బాడమె
నతనుబెంక్లియమ్య నవనిసురేంద్రులు

బుధులు బంధుజనులు బాగడ నెగడి
లింగమాంబ యనెడి మాంగల్యశీలిని
పొందె దశరథాన్వయ ధరాటియందు.

శా. ఆరాజద్గుణశాలి కీర్తిగలిగె నానారాతి విద్వద్వ్రజో
దారప్రజ్ఞ విరుద్ధమార్గ రవట స్థానాధ్య పొందిత్యుడు
ర్వారాశి ప్రతరాంగభూగాంబరలిన వ్యాపారతరగ్రస్ఫుర
స్థారాటోప వచఃప్రశిక్షిత విలక్షణ్యందశాస్త్రక్షరన్.

చ. అతనికిఁ గల్గె భూసురకులాంబుధి పూర్ణశశాంకమూర్తి సం
తతమహనీయకీర్తి నిజధర్మసముత్కరవర్తి మంత్రిశా
స్త్రతతిప్రగల్భ శోధన విధాన నిధాన సంధి సంవృత్తిస
న్నుతిహితరామమంత్రి బుధమాన్యతచిత్రచరిత్ర పాత్రుఁడై

వ. ఇందు మంత్రియనుసందున సమాధానము.

శ్లో. మంత్రిత్వంచ గురుత్వంచ పౌరోహిత్యం తథైవచ
బ్రాహ్మణైరేవ కర్తవ్యం అన్యతః పరివర్జయేత్.

టీ. మంత్రిత్వంచః ప్రధానత్వమును, గురుత్వంచ: గురుత్వమును పౌరోహిత్యం: పురోహితమును బ్రాహ్మణైరేవ: బ్రాహ్మణులచేతనే కర్తవ్యం: చేయఁదగినదని యున్నది. మఱియును. శ్రీమద్రామాయణే. "వసిష్ఠో మంత్రిసత్తమః" వసిష్ఠుఁడు మంత్రిశ్రేష్ఠుఁడని తెలిపియున్నది. విశేషించి బృహస్పతికి సురమంత్రియనుప్రసిద్ధియున్నది

వ. ఇంకను. అమరనిఘంటువునందు.

శ్లో. "మంత్రీసహాయసచివౌ" మంత్రిశబ్దము సహాయుని యం
దును స్నేహితుని యందును, ప్రవర్తించునని యెఱుంగునది.
ఇందువలన బ్రాహ్మణులు క్ష్మాపతులయిన భూపాలురకు
రాజనీతి ప్రవర్తనయందు ముఖ్య సహాయులౌటచే మంత్రు
లనియుఁ జెప్పఁబడిరి. మఱియు భారతము సభాపర్వమునం
దు ధర్మరాజుతో నారదమునీంద్రుండు రాజనీతిబోధిం
చునప్పుడు

క. అనఘుల శాస్త్రవిదక్షుల
నను రక్తుల పితృపితామహ క్రమమున వ
చ్చిన విప్రుల మంత్రులుగా
నొనరించి సకార్యసంప్రయోగము నొందుదునే.

వ. అని యిట్లనేక విధముల బ్రాహ్మణోత్తములకు మం
త్రిత్వంబు శ్రేష్ఠంబగుట మంత్రులనఁబడిరి. ఇందువలనను
యీగ్రంథకర్త తన పితామహుండయిన రామయ్యను
రామమంత్రియని చెప్పికొనియెను.

గీ. అంత నితఁడు దయించె వెంకయ్య వితతయశుఁడు
తల్లి వెంకాంబికకుఁ దండ్రి తల్లి పాపమాంబికకు
జనకాదులకు తిమ్మడంబు
దనర సద్భాగ్యమేలని తన్నుఁజూఁ గడ.

శా. అధీరుండు వివాహమయ్యె గుణవాంస్యక్ భవ్యప్రాజన్యనిక్
మేధాధన్యను బాపతి తీకుల సన్నికేజ నాకిజీని
సాంధాత్రాంబితతిమ్మరాజవరకన్యక్ రాజ్యలత్మాంబికన్
బోధ్యోపార్జితరామమంత్రజపసంభూతోరు సందాంబికన్

వ. ఇట్లు నిత్రాంధిరుఁడు తనవంతో వంపును తిమ్మరాజను సందుకు సమాధానము.

శ్లో. "రాజాంశభష్టం శకెటెండేవ" ఇతిశ్రేష్ఠవా చకమిత్యమరః

వ. ఇట్టి శ్రేష్ఠవాచకములను బట్టి బ్రాహ్మణులలోఁగొందఱిని భట్టు అనియుఁ గొందఱిని రాజనియుఁగొందఱిని దేవయనియుం వాడుకఁ జేయుచున్నారు. ఎట్లనిన విశిష్టాద్వైత భాష్యకార్లవారు యతిరాజులనియు, అద్వైతులలో గొప్ప పండితులను పోతరాజు పాపరాజనియు మఱియు పెద్దిభట్టు నన్నయభట్టు అనియు జయదేవుఁడనియుఁ జెప్పఁబడెను. అట్లగుటఁ జేసి తిమ్మయ్యను తిమ్మరాజని చెప్పకొనెను.

సీ. వారికి శ్రీహరి పంబాయుం ధాంశజు
లౌకియుని రఘుపతిరాయ సూరి
యనఘుఁడు రామయ్య యతి దయాన్వితుఁడగు
లక్ష్మీనృసింహుఁడు లలితగుణులు
వెంకటచలమయ్య వెంకటకృష్ణయ్య
లనువారు గల్గిరం దగ్రజుండు

శ్రీరామ భగవదర్పితచిత్తకమలుండు
ఘనవిశుద్ధజ్ఞాన జనహితుండు
విజయనగరావనీంద్రుడౌ విజయరామ
రాజరాజాధినాథుని రాజ్యమందు
ఘనులు మెచ్చనమల్దారి పని యొనర్చి
సాధులను గాచి చిత్తవిశ్రాంతిఁ గాంచె

వ. ఇట్టి నేను,

సీ. కర్మసాధనభక్తి కలితను జ్ఞానవై
రాగ్య(ప్ర)బంధ సాంఖ్యములను
దనుజమనుజదేవతతి యంశములఁ బోల్చి
లట్టివారల వృత్తులఖిలములును
కర్మఫలత్యాగనిర్గుణమార్గంబు
విష్ణునర్చనోత్కర్ష విభవములను
సాకారమెల్ల మినిరాకారమును .. న ?
పాదచతుష్టయం పరిమితంబు
పరమపదమును కనుగల వరపథంబు
నను దెలియుటకాంధ్రకావ్యంబు జేసి
జనకజామాతకంకితమొనర నిచ్చి
జన్మసఫలంబు నొందెను జనకునట్లు.

వ. అనఁగా జనకమహారాజు కన్యనిచ్చి కృతార్థుఁడ

యినట్లు ఈ కృతి ~~[illegible]~~ కావ్యకన్యనిచ్చి కృతార్థుఁ
డనగుదుననేను.

క. గురుబాధ దేవగణంబులు
నరనారాయణ వసిష్ఠ నతినౌక్షవశం
కరముఖులొప్పెడు సత్సభ
వరకావ్యసుకన్య నిపుడె వరునకు నిత్తున్

వ. అని యిట్లు నిశ్చయించుకొని నా హృదయపద్మంబున సన్న యున్నట్లు గలంచి విధ్యుక్తంబుగా నవ్వరుని ద్దేశించి
షష్ఠ్యంతములు.

క. శ్రీధరునకు సన్నుతగం
గంధరునకుం రఘువరునకుఁ గరివరదునకున్
భూధర సమధీరునకును
గాధిసుతాధ్వర సహాయ ఘనవీరునకున్
రక్షఃకుల విధ్వంసున
కక్షీణ కృపాపయోధి కమలాత్మునకున్
కుక్షిస్థాఖిల భువనున
కక్షయ తారకౌరునకు మహావిష్ణునకున్
దశకంఠ కంఠలుంఠన
విశిఖాఘ మహా(ప్ర)యోగ విజ్ఞానునకున్
దశరథ సుకుమారునకును

విశదపరాక్రమునకు రిపువిజయోద్ధతికిన్

క. విశ్వేశాంవరణాముల

ప్రత్యేశునకఖిలలోకజయహార్యునకున్

రక్షితసురపాలునకు వి

చక్షాంత సంకల్పితాపత్కృత నిచయంబాప్యునకున్.

క. శ్రీసీతా సహితునకును

కోసలనాథునకు భవ్యగుణశాలునకున్

దాసమనోల్లాసకృతవి

లాసునకును విమలకమలలలితాక్షునకున్

క అద్రిజసంస్తుతచరితునకును

భద్రాత్మునకజభవేంద్రవర్ణితపుణ్యకీర్తికిన్

క్షుద్రాసురమర్దనునకు

భద్రాద్రీశునకు రామపరమాత్మునకున్

క. సగుణునకు నిర్గుణునకు

నిగమాంత విహారునకును నిర్లిప్తునకున్

భగవంతునకును గురునకు

నగధరునకు హరికి దురితహరచరణునకున్

క. ఘనునకు పాదచతుష్టయ

మునసత్తెనుతునఖవిభాంతిపూర్ణత్వముచే

మనుకొని వెలిగెడి విభునకు

జనపతి వేషునకు రామ జగదాశరథునకున్

వ. పాదప్రక్షాళన పాణిగ్రహణదాన ధారాస్వాతంబుగాం స
మర్పింపఁబడిన యారఘుపతిరాయవ్యాపను వేదాంతకావ్యక
న్యకాహ్వ నిర్మిత సత్కథా ప్రపంచంబునకుఁ బ్రారంభం
బెట్టిదనిన.

## ౧. గురుపరిచర్యావిధాన ఘట్టము.

గీ. శ్రీమదుపనిషద్బృంద విశిష్టపరమ
తత్త్వవిజ్ఞాన సంపద దనరు
గురులకు లోకనాథ విప్రవరులుఁ గాంచి
మొందమొగ వంగ సాష్టాంగముగ నమస్కరించి

మ. భయమున్ భక్తియు యుక్తియున్ విమల విశ్వాసంబు సౌజన్యమున్
నయమున్ మించ సలాంఛనిల్లని మనోనవ్య ప్రభావిత్వని
త్యాయశ్రీవైష్ణవనా పదాబ్జయుగ సేవాధీనమై మోక్షము
వ్యయమొల్లఁ గదునాప్పు నంచు విని గావ్యా వచ్ఛ తిస్పష్టతి క్తి

వ. మోక్షము గురుపదాబ్జయుగ సేవాధీనమనునందుకుఁ
బ్రమాణవచనము.

శ్లో. "సాధుసంగతి సేవా త్ర మోక్షహేతురుదాహృతా"

టీ. అత్ర : ఈ మోక్షవిషయమునందు సాధు: సత్పురుషు
లయొక్క సంగతిసేవా: పరిచర్యాదికమే మోక్షహేతు:
ముక్తికిహేతువయినదని ఉదాహృతా: చెప్పఁబడ్డది. ఇత్యి

~~[illegible]~~ ధ్యాత్మరామాయణే అగస్త్యవచః

గీ. జగతి నారాయణుండె సదాచార్యుఁడరయ
సత్యమిది వేద వేదాంత సమ్మతంబు
సుమ్మియను పెద్దలను నట్టి సూక్తివలన
నెఱిఁగికొంటిని మీరె శ్రీహరియటంచు.

ఉదాహరణము. శ్లో. "ఆచార్యస్తు హరిస్సాక్షాచ్చరరూపీ న సంశయః" ఆచార్యస్తు: సద్గురువైతే చరరూపీ: మనుష్యరూపము నుదాల్చిన సాక్షాత్: ప్రత్యక్షమయిన హరిః శ్రీమన్నారాయణమూర్తియే న సంశయః: సందేహము లేదు. ఇతి శ్రీమహావిష్ణుపురాణే. శ్రు. "గురుస్సాక్షాదాదినారాయణః పురుషః" గురుః గురువు సాక్షాత్: ప్రత్యక్షముగా ఆదినారాయణః పురుషః: పురుషోత్తముఁడయిన శ్రీమదాదినారాయణపరబ్రహ్మమే ఇత్యర్థశ్శ్రుతిః. కావున.

క. ఆచార్యునకుం శిష్యుఁడగా
నెయ్యంబున నేరి మిగుల నౌతిజ్ఞునిగా
నాయ్యన శిక్షింపంగద
వయ్యా కరుణామతివి గదయార్యోత్తమ తలఁపన్

వ. అని యిట్లు విన్నపంబొనరించి.

సీ. తగ గురుహిత పదార్థంబుల నూహించి
కొని తెచ్చియొసఁగం నెమ్మనము దనర

నాపాదస్థితలమస్తకాభ్యంజనాతిథ్యములనొనర్చుచు
వేడ్క మునుకొనంగ
నాసక్తిమై బియ క్షేత్రారామ గృహముల
పసులుజేయునంబుధుల్ తేళ్ళయనంగ
తల్లిదండ్రియు కర్త దైవంబు దారయును
గురుఁడయుం ~~చూనా~~ చనియెంచి గొల్చునిట్లు
శాస్త్రవిధిహితాత్మాంగ సుస్థానభావ
సంజ్ఞలుగల శుశ్రూషలు సలిపి సమయ
మెఱిఁగి కైవల్య పద సుఖంబిడనఖ సుగ్ర
హింప వేయన గురు విభుండిట్టులనియె.

శ్లో. కైవల్య సుఖమనఁగా మోక్షసౌఖ్యమనుట.
ఇందుకు లక్ష్యము. శ్లో. ముక్తిః కైవల్య నిర్వాణం, శ్రేయో నిశ్శ్రేయ
సామృతం, మోక్షోపవర్గ ఇత్యమరః

౨ గురుకృపాలబ్ధ ఘట్టము.

గీ. పరమవైరాగ్య పదవి చేపరిఢవిల్లి
నాల్గువిధముల శుశ్రూష నడత తెఱిఁగి
బుధ జనంబుల సేవించు పొలుపు గాంచి
మెప్పు నీకంటె బొందఁ దార్యుఁడుర్విఁ గలఁడె

గీ. వినుము విద్యాంధులయి బహువెతలఁ జెందు
వారు పరికింప నిత్యసంసారులుర్వి

జ్ఞానమునరయి కృషి జేయుమానవాళి
నిత్యముక్తులు నిజమిది నిర్మలాత్మ.

జ్ఞానాజ్ఞాన స్వరూప నిర్ణయము.

శ్లో. అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనం
ఏతత్ జ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం యదతోన్యథా

టీ. అధ్యాత్మజ్ఞాననిత్యత్వం: ఆత్మజ్ఞానమందు నిత్యభావమును అనఁగా తన్ను ప్రత్యగాత్మగాఁ దెలియుట తత్త్వజ్ఞానార్థదర్శనం: మోక్షజ్ఞానమందు ప్రయోజన దృష్టియు అనఁగా ప్రత్యగ్బ్రహ్మైక్య జ్ఞానమనుట ఏతత్ జ్ఞానమితి: ఈ చెప్పఁబడిన జ్ఞానమని ప్రోక్తం: చెప్పఁబడెను ఇదిగలవారు నిత్యముక్తులగుదురు. అతః: దానికంటె అన్యథా ఇతరమయినది యత్: ఏదో అది అజ్ఞానం: అజ్ఞానమని ప్రోక్తం: చెప్పఁబడెను. ఈ అజ్ఞానులు జననమరణప్రవాహరూపమయి తోఁగుండెడి నిత్యసంసారులు. ఇతి భగవద్వచః

సీ. జంతుకోటికి నరజన్మంబు గలుగుట
పురుషుఁడయి పుట్టుట పూతవృత్తి
విప్రత్వమొందుట విధిహిత ధర్మమా
ర్గంబున నడచుట కలితశాస్త్ర
వేదియయి యలరుట విష్ణుపాదాంబుజ

భక్తిచే వరలుచు పరగ సాత్త్వి-
తత్త్వంబు నరయుట తగని ది ధర్మ్యసవో
నుండుట మోక్షంబు నొందగనుట
యొంతటి కంటెను దుర్లభంబౌ రీతి దలప
జన్మశతకోటి సుకృతవాసనలు గాని
గలుగనేరవు ఇది నిజంబిల వశిష్ట,
శతమఖాదులకయిన నెంచ శుభగచర్య.

శ్లో. జంతూనాం నరజన్మ దుర్లభమతః పుంస్త్వం తతో విప్రతా
తస్మాద్వైదిక ధర్మమార్గపరతా విద్వత్త్వమస్మాత్పరం
ఆత్మానాత్మవివేచనం స్వనుభవో బ్రహ్మాత్మనా సంస్థితి
ర్ముక్తిర్నో శత జన్మకోటి సుకృతైః పుణ్యైర్వినా లభ్యతే.

గీ. అనువున రీతి శిష్యుని కానతిచ్చి
మోము దప్పని తిరునవ్వు మొలకలెత్త
మరల నిట్లని పల్కె నామౌని విభుడు
వేదవేదాంత భావంబు విస్తరిల్ల.

3 సద్గురు వ్యాపార లక్షణ ఘట్టము.

గీ. తత్త్వబోధనందు తలపున గురునికై
వెతకుచున్నవారి వెతకు తీరంచు
బోధజేయు బంధుల బ్రోవ వెదక నివారి
బలికె నదియు మాకుఁ బని తెలంప

ఉదాహరణము:-

శ్లో. "సముద్ధరంతియే విప్రాః వేదంతం మత్పరాయణాం
తాంసుద్ధరిష్యే నచిరా"దితి శ్రీమహాభాగవతే ఏకాదశస్కంధే
టీ. ఏ విప్రాః; ఏ బ్రాహ్మణులు మత్పరాయణాం; భగవంతుడనయి
న నాయందు - ఆసక్తి, గలిగియు, వేదంతం తగినగురువుగా దొరకక
వెతుకొనుచున్నమనుష్యుని సముద్ధరింతి. బోధించితరింపజే
యుచున్నారో తాం: - ఆ బ్రాహ్మణులను నచిరాంతే: అవ్యవధా
నముగా ఉద్ధరిష్యే తరింపజేయుచున్నాను. ఇతి భగవద్వాక్య
క. జ్ఞానముకేవల కృపన
జ్ఞానికి నుపదేశవిధి ప్రకాశముజేయన్
గానది సకల ధరిత్రీ
దానంబుల కంటెనధిక తరఫల దమగున్ ఇతి శ్రీమదాంధ్ర
మహాభారతము.

వ. అనుచునిట్లు గురుకారుణ్య భావంబొప్ప బలికి తననమనంబున

౪. గురుబోధాంతరీ బనఘట్టము.

సీ. శబ్దశాస్త్రార్థవిచక్షణుండే బోధ
నొందయుదమనదియదవియందు
పూర్వమీమాంసచే పొసంగున ద్గతియన్న
కర్మమార్గంబది గహనమందు
శ్రీ పర మీమాంసచే పొందు సుఖమన్న

పదియును భాష్యసాధ్యంబటంద్రు
భాష్యంబుచే మేలు బడయుద మన్నన
దాన సారము రాదగు పోరు మీరుసంద్రు
పొరఁబొచ్చిన నారకనాలెవి కారదండ్రు
కలతగాందయు కల్లలకు వెడగలుగదండ్రు
ఇట్టి దుస్తరచర్చలకెవ్వఁడో పు
సోపిననుచిత్త విశ్రాంతి చూపదండ్రు

కారికశ్లో. "శబ్దజాలంమహారణ్యం చిత్తవిభ్రమకారణం" ఇతి
వివేకచూడామణ్యాం భాష్యకారవచః

టీ. శబ్దజాలం. శబ్దసమూహము. మహారణ్యం గొప్పయడవి. చిత్తవిభ్రమకారణం మనోవిభ్రాంతిని పుట్టించునట్టిది.

శ్లో 'గహనాకర్మణోగతి' రితి భగవద్వచః టీ. కర్మణః కర్మము యొక్క గతిమార్గము గహన ప్రవేశింపనలవి కానిది. మఱియును

గీ. ఆగణితంబులు వేదంబులవియు దీర్ఘ
కాలసాధ్యంబులగు భూరి తజాలజీవి
తంబులల్పంబు మన్త్రాయంబుల స్థిర
మందురెప్పుడు సాధులమందమతి.

కారిక. "అనంతవేదా బహువేదితవ్యాః అల్పశ్చ కాలో బహవశ్చ విఘ్నాః" ఇతి ఉత్తరగీతే.

వ. ఇట్లు శంకించి తత్త్వసారాంశంబుం గ్రహింపనటు కుందగుసులభో

పురుషార్థమగు నది భువి నైదు విధములు
బరగునందు విను సత్కీర్తివలన
సాలోక్య సామీప్య సాయుజ్యములు గల్గు
నియమాంగమును గూడి దనరు హారమము.
యోగవితానములను నమరు సార్ష్టిత్వ . . . ?
మహిమను నవరతము . . . . .
పరమవిజ్ఞానమున దాయయు భవ్యతరవి
దేహ కైవల్యముక్తిని స్థిరత మెఱయు.

వ. అని వెండియు కర్మస్వరూప నిరూపణంబొనరింపం దలంచి యిట్లనియె.

౭. కర్మస్వరూపనిరూపణఘట్టము.

సీ. వాక్పాణిపాదాద్యవయవంబులవలన
సంతతమొనరించు సకలక్రియలు
అంతరింద్రియవృత్తు లఖిలము శబ్దాది
విషయానుభూతియు విషయములను.
. . . . . దల్పగనందు ~~కృతాకృతాది~~ కలితాద్యయనదాన
కృత్యాదు లుత్కృష్ట కర్మలదియు
సాత్త్వికాసాత్త్విక సంజ్ఞలవర్తిల్లు
పరవనితాహత్య ప్రముఖ వర్జ్య
లరయ పాపకర్మ లనంబడు నష్టాంగ

సహిత సకలయోగ సాధనంబు
లుచితకర్మలం బ్రసిద్ధమానంద్రులు
భూసురాన్వయాబ్ధిపూర్ణచంద్ర

వ. మఱియుం బూర్వోక్తంబులగు సకలసత్కర్మంబు
లుపేక్షరుగాం బ్రవర్తించునప్పుడు చెప్పంబడు దేవతా
యజన సాధనంబులయిన అగ్నిహోత్రాదికంబులును తీర్థ
యాత్రావిశేషంబులును నిత్యనియమవ్రతంబులును
ధనకనకవస్తువాహనగోభూహిరణ్య రత్నాంబరాభర
ణ దివ్యమందిరగ్రామాలంకృత కన్యాప్రముఖ దానంబు
లును ఇంద్రియనిగ్రహంబనెడి ప్రతిహారాత్మనియందు
శబ్దాదివిషయంబుల హేయంబుగా నర్చుటయును ప్రాణా
యామాది నియమంబులును వేదాధ్యయనంబులును
శ్రుతిస్మృతీతిహాసపురాణశాస్త్రార్థంబులనెఱింగి
యెఱింగించెడి పాండిత్యంబును లయంబానర్చునట్టి
ఇంద్రియజయంబును తీక్ష్ణనియమవ్రతంబును అపాన
వ్యాపారంబునందు ప్రాణవ్యాపారంబును ప్రాణవ్యాపారంబు
నందు నపానవ్యాపారంబును లయంబానర్చునట్టి లయయో
గంబును పూరకకుంభకంబుల ప్రాణాపానవాయుగతుల
నిరోధించుహారంబును మితాహారంబును వాయువిశే
షంబుల వశీకృతప్రాణవాయువులయందు త్రిల్చుట

తారకాది యోగత్రయంబును నివృత్తినియమును యజ్ఞం
బులనియె యింకను దివ్యాది మొదలయిన సకలయజ్ఞంబు
లు వేదముఖంబునం బ్రకటింపం బడియెనని బోధించె నిందియు
నిట్లనియె.

ఇందుకు శ్రుతి. శ్లో॥ ఏవం బహువిధా యజ్ఞాః వితతా బ్రహ్మ
ణోముఖే, కర్మజాం విద్ధి తాన్ సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే
ఇతి. ఏవం. ఈ ప్రకారముగా గీతోపనిషదియొక్క నాలు
గవ యధ్యాయమందు ఇరువది నాలుగవ శ్లోకము మొదలు
కొని యెనిమిది శ్లోకములచేత బోధించిన బహువిధాః
నానా ప్రకారములయిన యజ్ఞాః యజ్ఞములు బ్రహ్మణః
వేదముయొక్క ముఖే ద్వారమందు వితతాః విస్తీర్ణముల
యునవి. సర్వాన్. సమస్తములయిన తాన్ ఆ చెప్పంబడిన య
జ్ఞములు కర్మజాన్ కర్మలవలననె పుట్టినవిగా విద్ధి తెలియు
ము. ఏవం ఈ ప్రకారముగాను జ్ఞాత్వా తెలిసికొన్న
భగవద్భక్తియుక్తుండవయి విమోక్ష్యసే కర్మ క్షయంబగు
జననమరణ ప్రవాహరూప సంసారబంధమువలన విడువ
బడగలవు. ఇతి భగవద్వచః.

గీ. జననమరణప్రవాహ సంసరణము నశించ, నందముగు మూల
కందమయి, క్రిందుమీందు నొందఁజేయు బహుజీవులకెండు ని
లువ, నాయతేష్టాల్లనొందించు నెపుడు కర్మ.

లక్ష్యము:-

శ్లో. క్రియా శరీరోద్భవ హేతురాదృతా

ప్రియాప్రియౌ తౌ భవతస్సురాగిణః

ధర్మేతరౌ తత్ర పునశ్శరీరకం

పునః క్రియాచక్రవదీర్యతే భవః

టీ. సంరాగిణః దేహాభిమానికి, క్రియ. కర్మ, శరీరోద్భవ హేతుః శరీరము కల్గుటకుం గారణమయి ఆదృతా అంతట నిశ్చయింపబడినది. తౌ ప్రియాప్రియౌ అందుల సుఖ దుఃఖములును భవతః అగుచున్నవి. ధర్మేతరౌ : ధర్మాధర్మములును అలాగే యగుచున్నవి తత్ర. ఆపద్ధతియందు పునః మెండియు శరీరకం శరీరమును అగుచున్నది పునః - తిరిగిన్ని ఆశరీరము వల్ల క్రియాశ్చ కర్మయు అగుచున్నవి. ఏవం ఈప్రకారముగా భవః సంసారము చక్రవత్. ~~…~~ బండిచక్రమువలె ఈర్యతే తిరుగుచున్నది. ఇతి శ్రీమదధ్యాత్మరామాయణే శ్రీరామభగవద్వచః.

గీ. ఆదిమధ్యాంతరంబుల నఖిల దుఃఖ

ములకు నెలవగు నీకర్మవలన బాధము

జన్మమునకం బుదెలియుము జగతినెపుడు

భూమిసురవర్య సద్ధైర్య పుణ్యచర్య లక్ష్యము.

"ఆదౌచ మధ్యేచ తథైవచాంత తోభవం విదిత్వా భయశోకకారణం"

టీక. ఆద్యాచ కర్మాదియందును మధ్యేచ కర్మమధ్యయందును తథైవ అప్రకారముగానే అంతతః. కర్మాంతమందును భవం. సంసారమును భయశోకకారణం భయశోకములకు కారణముగాను విదిత్వా తెలిసికొనియుండుము. ఇతిశ్రీరామభగవద్వచః.

వ. వెండియు వినుమీ సర్వకర్మంబులకు కామంబు కారణంబగునది మనోబుద్ధీంద్రియంబుల నధిష్ఠించి సాంత్వికరాజస, తామసంబుల~~ను~~ని త్రివిధంబులయియుండు నందు సాత్వికంబు మలినంబనియు శుద్ధంబనియు రెండు తెఱంగులం జెప్పంబడు. మఱియు కేవలనరులగువారికి మలినసత్వంబును దేవతాంశోద్భవు~~లు నా~~లగు మనుజులకు శుద్ధసత్వమును సహజంబగు రాజసతామసంబులు దైత్యదానవ పైశాచికాంశజులకు నిత్యంబుయియుండు నింకనీ రాజసతామసంబులు ~~దైత్యదానవపైశాచకాంశజులకు నిత్యంబుయియుండు~~ భక్తిజ్ఞానవైరాగ్యంబులనాచ్ఛాదించి దేహధారులనానావిధంబుల మోహింపఁజేయుచు విగులదుర్నయంబులం ద్రిప్పుచుండుననిన విని శిష్యుండిట్లనియె సర్వకర్మంబులకు కామంబు కారణంబను నందుకు దాహరణము. శ్రు. కామః కారయతే తి తైత్తిరీయశ్రుతిః

కామః. కామము సర్వమును కారయతి చేయించును.

శ్లో. కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః

మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణం

ఓ పార్థా ఏషః దుష్కార్యంబులు జేయుదలంచనివాండయినను దేని
చే బలాత్కారంబుగా ప్రేరేపింపంబడి పాపకర్మంబులొనర్చునని
నీచేతనడుగంబడిన యీహేతువు రజోగుణ సముద్భవః రజోగు
ణము వలనంబుట్టిన కామః కోరిక ఏషః ఈకామమే క్రోధః ఒకానొక
నిమిత్తం కొంచ్ఛబడినదయి క్రోధరూపముగ పరిణమించుచున్నది.
మఱియును దెట్టిదనిన మహాశన అధికమయిన భక్షణము గలి
గినదియును మహాపాప్మా మిక్కిలి పాపస్వరూపమయినదియుంగా
వ్వన ఏనం ఈకామమును ఇహ ఈ మోక్షమార్గమునందు వైరిణం
శత్రువుగాను విద్ధి తెలియుము. ఇతి భగవద్వచః (అధ్యాయ
ము 3 శ్లోకము 37)

శ్లో. ఇంద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠానముచ్యతే
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్

ఇంద్రియాణి ఇంద్రియములు మనః మనస్సు బుద్ధిః బుద్ధియు
అస్య ఈకామమునకు అధిష్ఠానం ఆశ్రయములని ఉచ్యతే చె
ప్పంబడుచున్నయవి. ఏషః ఈకామము ఏతైః ఈ యింద్రియ
ములచేత జ్ఞానం జ్ఞానమును ఆవృత్య కప్పి దేహినం దేహధా
రుని విమోహయతి నానాప్రకారములుగా మోహింపంజేయు
చున్నది. ఇతి భగవద్వచః (అధ్యాయము 3 శ్లోకము 40)

క. ఏకామముచే పురుషులు ఏకార్యములొనరంజేసి యేయేఫలముల్

జేకొనుచుందురొ దెల్పవె సాకల్యంబొనర జగతిసంభవుడ నరన్

వ. అనిన విని రజోగుణ సముద్భవంబగు కామంబుచే మెలంగు దై
త్యాంశజుల చర్యాతెఱంగింప దలంచి గురువిభుం డిట్లనియె.

క. అరయ భూలోకమందు సురాసురాంశ
ములను కొందఱు మనుజులు బుట్టుచుంద
రందు దైత్యాంశజుల చర్యలన్నినోకు
ముందుగా దెల్పెద నవి వినుము దమెసంగ.

లక్ష్యము.

శ్లో. ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవచ
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు॥

ఓయి అర్జునా! అస్మిన్లోకే ఈ నరకలోకమునందు దైవశ్చ దేవ
తా సంబంధమనియు ఆసురశ్చ ఆసుర సంబంధమనియు
భూతసర్గ ప్రాణి సృష్టులు ద్వౌ రెండు విధములు గలవి.
ఇతి భగవద్వచః అ.౧౬. శ్లో౬.

౫. దైత్యాంశజన ప్రవర్తన నిరూపణాష్టకము.

క. ప్రళయకాలంబె తుదయునయి ప్రబలునట్టి
యపరిమితచింతలాత్ముల నావరింప
విషయభోగంబులే ముఖ్య విషయముగను
గలిగి వర్తింతు రసురాంశజులు ధర(త్రి). ౧.

క. తననుం తగనట్టి కోర్కెలు తగిలి కొనగ

శాస్త్రనియంబులను మదిసరకుగొనక
బలముదర్పంబుక్రోధంబుపరిఢవిల్ల
నడచునక్తంచరాంశజుల్ జెడుదురవని

దృష్టాంతరవచనము.

శ్లో. కామమాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః
మోహాద్గృహీత్వాసద్గ్రాహాన్ ప్రవర్తంతే శుచివ్రతాః.

టీ. దుష్పూరం నిండింపనశక్యంబులైన కామం కోరికలను - ఆశ్రిత్య - ఆశ్రయించి మోహాత్ మోహమువలన అసద్గ్రాహాన్ కూడని పరిగ్రహములను గృహీత్వా గ్రహించి అశుచివ్రతాః ఆ శాస్త్రజ్ఞాననియమమార్గములుగలవారలయి ప్రవర్తంతే ప్రవర్తింపుచున్నారు. ఇతిభగవద్వచః (అ ౧౬. శ్లో. ౧౦.)

గీ. ఉచితమనుచిత మెఱుంగరు శుచిరహితులు
దుష్టమతులస్పృతులు సదా దురభిమాను
లు, వినయాచారదూరులు భువినరయగ
పూర్వదేవతాంశములను బొండము నరులు

ప్రమాణవచనము.

శ్లో. ప్రవృత్తించ నివృత్తించ జనాన విదురాసురాః
నశౌచం నాపిచాచారో నసత్యం తేషు విద్యతే.

టీ. అసురాః అసురస్వభావముగలిగిన జనాః జనులు
ప్రవృత్తిం ధర్మప్రవృత్తిని, నివృత్తించ ధర్మనివృత్తిని

నవిదుః తెలియరు తేషం వారియందు శౌచశుచిత్వమును
ఆచారోఽపి ఆచారమును సత్యంచ యదార్థభావమును
నవిద్యతే ఉండదు. ఇతిభగవద్వచః. (అ౧౬ శ్లో౭.)

గీ. ధరయా సత్యశౌచాది ధర్మములను
దగ్ధములు చేసి దౌర్జన్యతను వహించి
హరిశిహరిభక్తులకు నెగ్గు నవరతము.
సలుపుచుందురు రాక్షసాంశజులు విప్ర

లక్ష్యము. శ్లో. అహంకారం బలం దర్పం కామం క్రోధంచ సంశ్రితాః
మామాత్మపరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః.

టీక. అహం ~~...~~ అహంకారమును బలం బలమును దర్పం దర్పమును కామం కామమును క్రోధమును సంశ్రితాః ఆశ్రయించినవారలయి ఆత్మపరదేహేషు స్వపరదేహములయందుం మాం భగవంతుఁడనయిన నన్ను ప్రద్విషంతః ద్వేషింపుచున్నవారలయి అభ్యసూయకాః తమయందే శ్రేష్ఠత్వప్రభుత్వములన్ను ఆరోపించుకొని పరశ్రేయస్సును సహించనివారలయి ఏ ఎవరు వర్తింతే ఉన్నారో వారు.

గీ. పొసఁగ మాతృకాదిభూరాంతంబులనుగాల్చి
రాజ్యపదవినమరు రాజులెల్ల
తత్వబోధనాంధ దలఁచక నంధులైయు
వదవఁ గష్టములను గాంతురయ్య.

లక్ష్యము.   రాజంతే నరకం ధ్రువమితి పండితవచః

గీ. దారలదయ నధికారంబు దారికెన్నని
సాధుజనబాధ జేతురు సత్యము డిగి
డంబమదమానగర్వవిడంబమెసఁగ
పూర్వదేవాంశజులు నగుపురుషులవని

గీ. న్యాయమొనరింతులుంచము నంటననుచు
దాంటమాత్రంబు జెప్పుచు మఱియు సభను
నిజము కల్లఁగ కల్లను నిజముగాఁగ
దలఁచుదైత్యాంశజుఁడు కులధర్మమెసఁగ

గీ. వినుము బధిరాంధమూకత్వమిసుమడింప
వారు ప్రాజ్ఞుల ప్రాజ్ఞులు వారటంచు
దెలియనేరక నధికారబలిమి దలిగి
జనుని పూరిజాంత్యు రసురాంశజనులు తుదకు.

వ. ఇట్లు దైత్యాంశజులగు వివిధాధికారధనికజననికరం
బులు దురభిమానత్వంబును క్రోధంబును వివేకశూన్యం
బును గలిగి బహువిధంబు లయిన యాశాపాశంబుల
చేఁ గట్టంబడి న్యాయవిరుద్ధంబుగా ధనకనకవస్తువాహనం
బుల నార్జించుచు మాఁచేత నిప్పుడే ధనంబుసంపాదింపం
బడియె నింకబహుళంబుగా ద్రవ్యంబుసంపాదింపంగల
నేర్పులనేకంబులె యుండుదుము మీసంకల్పంబులాంకానా

కష్టుడయిన నిష్ఫలంబులగునే యిప్పుడీ శత్రులం జయించితి
మింక తటస్థింపుమైరివర్గంబులనణంచెదము. మేము భోగవంతు
లము. మేము సంపన్నులము. మేమే సుఖవంతులము మేమే సంప
న్నులము మేమే సుఖవంతులము మేమే ధర్మకార్యనిర్వాహకుల
ము మేమే సత్కార్యప్రసంగులము. మేమే పండితులము మేమే
శాస్త్ర~~ ~~వాదనిర్వాహకులము. మేమే వేదవే~~ ~~దాంగధ్య
యనపరులము మాంతోంటి సమంబెవ్వఁడగు యజ్ఞాదికార్యం
బులొకంబు లోకంబులోనరించుటకు నానరింపఁజేయుట
కు సంతసించుటకు మేమే సమర్థులమని యివ్విధంబున సహ
స్మృతితోడఁ దమ్ముఁదామే పాత్రంబులుఁజేసికొనుచు భగ
వద్భక్తులగు సాధులకంటెఁ దామే శ్రేష్ఠులమని వారిం గనిని రా
కరించుచు ధనమానమదాన్వితులయి శాస్త్రంబులుపది
వియును తన్నియమ్యంబులంగకింపక స్వతంత్రులయి విహరిం
చుచుందురని గీతోపనిషద్దెలుపుచున్నదని వెండియు
నిట్లనియె. లక్ష్యము.

శ్లో. — ఆఢ్యోభిజనవానస్మి కోన్యోస్తి సదృశోమయా
యక్ష్యేదాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః. ఇత్యాదయః

టీక. — ఆఢ్యః. ధనముగలవాఁడను అభిజానవాన్ సత్కు
లముగలవాఁడను అస్మి అయితిని మయా నాతోడ
సదృశః సమానుఁడు అన్యః మఱియొకఁడు కః ఎవ్వఁడు

అస్తి. కలదు యక్ష్యే యజ్ఞముచేసెదను దాస్యామి ఇవ్వగలను
మోదిష్యే సంతోషింపఁగలను. అని
ఇతి ఈప్రకారముగా, అజ్ఞానవిమోహితాః అవివేక
ముచేత మోహింపఁబడినవారలయి. (అ. ౧౬. శ్లో. ౧౫.)

శ్లో. అనేకచిత్తవిభ్రాంతా మోహజాలసమావృతాః
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకే శుచౌ.
(అధ్యాయము. ౧౬ శ్లోకము ౧౬) టీక.

అనేకచిత్తవిభ్రాంతాః నానావిధచిత్తవైకల్యముగలవారల
యి మోహజాలసమావృతాః మోహపాశములచేఁజుట్ట
బడినవారలయి కామభోగేషు కామానుభవములయం
దు ప్రసక్తాః. ఆసక్తులయినవారలయి అశుచౌ అ
శుచియయిన (కశ్మలముతోఁగూడినదనుట) అట్టి
నరకే నరకమందు పతంతి పడుచున్నారు. ఇతిభగవద్వ
చః (అధ్యాయము ౧౬ శ్లోకము౧౫, ౧౬.)

ఉ. కొందఱు రాక్షసాంశజులు కొంతక యజ్ఞములందుఁజేతురా
ఉదఱునవ్యాపారాజకుల నగ్నులగూర్చి ద్రమ్ముఖాదులంటే నం
దెందుసునస్నదానమొనరించుట నింబుకతేక పెద్దపే
రొందుట దక్షిణ దక్షిణవిధ్యోన్నతి సర్వము మంటఁగల్పగనే
లక్ష్యము. అభిసంధాయ తు ఫలం దంభార్థమపిచైవయత్
ఇజ్యతే భరతశ్రేష్ఠ తంయజ్ఞం విద్ధిరాజసం.

టీక. హే భరతశ్రేష్ఠ ఓయి అర్జునా! యత్ ఏయజ్ఞము ఫలం ఫలము ను అనుసంధాయ ఉద్దేశించియు దంభార్థమపి మహత్త్వప్రకటనకొఱకును ఇజ్యతే యాగము చేయబడుచున్నది తంయజ్ఞం ఆయజ్ఞమును రాజసం రజోగుణ సంబంధమయినదిగా విద్ధి తెలియుము ఇతి భగవద్వచః (అ౧౭ శ్లో ౧౨)

గీ. మఱియుఁ పైశాచకాంశల మసలు నరులు
దక్షిణలు లేని యజ్ఞముల్ దగిలి జేతు
రదియు బహుబుత్త్రమిల సోమయాజి పేర్ల
బిలుచుఁ బేలునను చును ప్రియము మెఱయ.

కారిక. శ్లోకము.

విధిహీనమసృష్టాన్నం మంత్రహీనమదక్షిణం
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే

టీక. విధిహీనం శాస్త్రవిహితమయినది కానట్టియు అసృష్టాన్నం అన్నదానము లేనట్టియు శ్రద్ధావిరహితం శ్రద్ధ లేనట్టియు యజ్ఞం యజ్ఞమును తామసం తమోగుణసంబంధమయినదిగాను పరిచక్షతే చెప్పుదురు. ఇతి భగవద్వచః (అ౧౭ శ్లో ౧౩.

వ. ఇట్లు. గీ. అగ్నిహోత్రంబులు దక్షిణలందుకొనుచు
పరగ సత్తె సరీదు మనిబొలుకొనుచు
పెద్దలమటంచు మహంటికి వెనగుడుచు
జేయు, క్రతువుల స్వర్గంబు చెందఁగలదె.

గీ. లోకములు వానికి వెగల్ల లోకపాలురను
గలుగ జేయను బెంచను కడక ద్రుంచ
గలుగు వాఁడని నొకఁడెందుఁ గలఁడటంచు
కలహ మొనరింతురసురాంశజులు ధరిత్రి

లక్షణము. శ్లో. అసత్యమప్రతిష్ఠంతే జగదాహురనీశ్వరం
అపరస్పరసంభూతం కిమన్యత్కామహైతుకం

టీక. తే.- ఆ యసురజనులు జగతీ జగత్తులను అసత్యం లేనిదానినిగాను అప్రతిష్ఠం ప్రతిష్ఠారహితమయినదిగాను అనీశ్వరం శిక్షకుఁడులేనిదానినిగాను ఆహుః చెప్పుదురు. మఱియు అపరస్పరసంభూతం స్త్రీపురుషులు కారణముకానట్టి వలనఁబుట్టినది అన్యత్కిం వేఱేమిఁగలన్నది, సకలజగత్తును కామహేతుకం కామమే హేతువుగాఁగలిగినదని చెప్పుదురు.

ఇతిభగవద్వచః (అధ్యాయము ౧౬ శ్లో ౮) ఇట్లు

గీ. విధినిషేధ వివర్జితుల్ బుధవిమతులు
నిఖిల దుర్వాదరతులు దుర్గతిమతులు
జ్ఞానమిష ఘోర దుర్బోధకర గురువులు
కలుషసంకల్పులసురాంశజులు తలంప

క. దబ్బర వేదాంతంబులు, నిబ్బరముగ దెలిపియుడియె నిర్మల
మనుజాచర్ దబ్బెల్లలాంగజూతురు
గాంఙ్ఞానదైత్యాంశ జనులు గోలలవద్దన్

క. ఆసురాంశజులకు నెప్పుడు
పొసగదు సాత్త్వికము నిజము బోధించినతా
మనమున కసురుదు రార్యుల
వసుధ దురాత్ములకు నిహము పరముం గలదే ?

వ. మఱియును.

గీ. వ్యాసనములగు విప్రులవబ్బవేద
వినరు పలుకరు తలయెత్తి కనరు ధర్మ
కార్యమిదియంచుఁ దలఁచరు కాంచమిదరు
దానవాంశజులయినట్టి ధనికులవని

వ. అట్టి నిశాచరోద్భవులును దుర్నయులునగు ధనవంతులు
తమతమ దాతృత్వంబులఁ బ్రకటింపఁదలంచినప్పుడు

సీ. జూందగాండ్రకు మంచి జుల్మతగుర్రముల్
పండితులకు శేరుపాంత చేళ్లు ?
కొండెగాండ్రకు జరీకోకలు రూకలు
వైదజ్ఞమణులకు తవ్వెడాళ్లు
తార్పునేస్త్రులకును తారహారంబులు
తగుబుధకోటికి దమ్మిడీలు
విటకత్తెలకుగొప్ప వెలగల తొడవులు
వేదపాఠులకు పిడికెడేవలు
నిచ్చి ఫబ్బుచుమూర్ఖులు హెంబ్బిపొంగద

తమవదాన్యత్వబుద్ధికి తామె మెచ్చి
కొనుచు వర్తింతురెప్పుడు కువలయమున
సంశయింపకరాక్షసాంశజులిపుడు

వ. మఱికొందఱు.

గీ. వినయమొనరింప ధూర్తుఁడౌజనుఁడుండ్రు
పిన్నపెద్దాంతరమ్ము నెంచి పిలువ నితఁడు
స్వాతిశయమ్ముండ్రు దానవాంశజులు వారి
యెదుట మెలఁగుట వెఱ్ఱికో యెరుకపడదు.

గీ. గురుని నిందించుచుండుట పరులు నింద
చెప్ప వినుచుంట గురుబోధ కల్ప గట్టి
శాస్త్రవిరహితబోధకు జనుట విధియె
దానవాంశజులగు వారి ధర్మమనఘ.

గీ. వారు ప్రాజ్ఞ్యలనుచు వింద మదెట్టిదో
శిష్యవేషమునను జేరివారి
గుట్టు తెలిసివచ్చి రట్టడి చెప్పెద
మనుచుఁ జాటవత్తురసురజనులు

గీ. కష్టతరమని కులధర్మకర్మ విడిచి
యతులసుఖమంచుఁ దగనన్యమతమునొంద
జూచుచుందురు దనుజాంశజులు వసుధలోని
మగని విడనాడి విటకాని మరగునట్లు.

౨. భగవద్భక్తివివర్జితు

లగుమనుజులు కర్మనిష్ఠులయిన వారలైన

తగ చైత్యాల సమనె యుంగుమ:

నిగమాంతవిచారనిపుణ నామదిలోన నే

లక్ష్యము. శ్లో॥ నమాం దుష్కృతినో మూఢాః

(ప్ర)పద్యంతే నరాధమాః, మాయయాపహృత

జ్ఞానా ~~ఆ~~సురం భావమా(శ్రి)తాః.

శ్లో. మద్భక్తి విముఖానాం హి శాస్త్రగర్తేషు ముహ్యతాం

నజ్ఞానం నచ మోక్షస్స్యాత్ తేషాం జన్మశతైరపి

టీక. శాస్త్రగర్తేషు ముహ్యతాం: శాస్త్రములశాస్త్రమనెడి

గర్తేషు గోతులయందు ముహ్యతాం మునుగుచున్నటువంటి

మద్భక్తివిముఖానాం మద్భక్తి నాభక్తియందు విముఖానాం నహ్య

ముతేనటువంటి ఆజనులకు జన్మశతైరపి జన్మశతముల

చేతను జ్ఞానం జ్ఞానమును మోక్ష(స్స్యాత్) ముక్తియును స్సిద్ధి

కలుగదుగదా. ఇతి(శ్రీ)మదధ్యాత్మ రామాయణే(శ్రీ)రామ

భగవద్వాక్యం) వి.హరిపరతంత్రులైశమదమాదులనొప్పెడి వారువైష్ణవులే

పరమపది. ~~హరిపరతం~~(త్రు)లైలుర్వి దలిపక శుచి సత్యదయావిహీనులై

పరవనితాపరార్థహృతవాంఛలనొంది వివేకశూన్యులై

తిరిగెడి వైష్ణవాఖ్యులు సుధావరరాత్మసుతెన్నొంగులనే

~~[illegible]~~ మడియును.

గీ. ఇట్లు దుష్కర్మ దుర్వృత్తి నుమదింప
కాలమెల్లను పాసనాడి కడతు యముని
పురికిఁ జను దురు దుఃఖ ప్రపూర్ణులగుచు
పుడమి నక్తంచరాంశజుల్ పోడిమువిగ

వ. కావున.

గీ. నరకమునకుఁ ద్రోవ నరయఁగా మఱి క్రోధ
లోభ మోహాచయము లోకతతికి
ధీరహృదయుఁడ వినుము. దేవతాంశోద్భవుల్
వాటిఁ జేరఁ జేరు విమలులగుట.

లక్ష్యము. శ్లో. త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః
కామస్క్రోధ స్తథా లోభ స్తస్మాదేతత్త్రయం త్యజేత్.

టీక. కామః కోరికయనియుఁ క్రోధమనియు తథా అట్లే
లోభః లోభమనియు త్రివిధం మూఁడువిధములుగలదిన
ఇదం ఇది నరకస్య నరకమునకు ద్వారం వాకిలి ఆత్మనః
తనకు నాశనం నాశకరమయినది తస్మాత్ అందువలన
ఏతత్త్రయం ఈమూఁటిని త్యజేత్ విడువవలెను.
ఇతి భగవద్వచః (అధ్యాయము ౧౬ శ్లోకము ౨౧)

వ. ఇదియునుంగాక.

గీ. సాత్త్వికులుగాని వారిచే చదువు చదువు
లకుఁగల ఫలంబులెల్ల సుప్రకటపటచ

దలఁచియిట్లని వత్సె సాదరము మీఱ
సంతతానందమున శశిచంద్ర చంద్రికలర

వ. అదియెట్లనిన

సీ. చదరంగములనాడుచు ముదమందనొకఁడొంట
నొకయొంటము చ్చటలకును జూచ్చు
శాస్త్రవాదంబుల సల్పుచు నొకఁడెంత
నొకఁడెంత శ్రుతిపాఠ మెసఁగఁ జేయఁగ
బహుగంటములకవిత్వము జెప్పనొకఁడెవ
నొక దేవ వీణె బల్కొప్పు మీటు
వెన్నెలసైఁదు గవ్య తెన్నుచుండొకఁ డెవ
నొక డెవ జ్యోతిషంబు సరఁ దెలుపు
నెలమిఁ బ్రత్యర్చనలఁ గన్నకలిమి నిట్లు
దనరు దైత్యాంశజులలోన ఘనుఁడొకానొ
కండు శతోవముఖాసురభంగి గండు మిగిలి
ధరణి విహరించుచుండును దండశక్తి
లత్త్వము. శ్లో. యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః
ప్రేతాన్భూతగణాంశ్చాన్యే యజంతే తామసా జనాః

టీక. సాత్త్వికాః సత్త్వగుణనిష్ఠులు దేవాన్ దేవతలను
యజంతే పూజింపుచున్నారు. రాజసాః రజోగుణనిష్ఠు
లయిన అన్యమతికెందలయిన జనాః జనులు.

ప్రేతాన్. ప్రేతలను భూతగణాంశ్చ మాతృకాదులను
యజంతే పూజింపుచున్నారు. (ఇతి భగవద్వచః అ౧౭శ్లో ౪.)

గీ. శ్రోత్రములు విద్యలెల్లను చదివి చదివి
క్రతువులాచరించు నప్పుడు శ్రుతిహితముగ
నడచి నడిపించనొల్లక కడకు యముని
గనఁగఁ బనుదురు దైత్యాంశ జనులు వత్స!

వ. మఱియును.

గీ. గురుని సేవించి సద్బోధఁగాన నిచదువు
లరయ హయ వస్త్ర హారాగ్రహారములకు
కారణంబగు నింతియగాని లేశ్ల:ప
ముక్తి నివ్వఁ జెప్పుడు మొనయనేనఘ

లక్ష్యము. శ్లో. వాగ్వైఖరీ శ్శబ్దశయ్యా శాస్త్రవ్యాఖ్యానకౌశలం
వైదుష్యం విదుషాస్తద్వద్భుక్తయే నతు ముక్తయే.

టీ! వాగ్వైఖరి వాగ్ధోరణియు శబ్దశయ్యా శబ్దరచనయు శా
స్త్రవ్యాఖ్యానకౌశలం శాస్త్రార్థములను విచారించెడి నేర్పును వైదు
ష్యం పాండిత్యమును విదుషాం విద్వాంసునికి భుక్తయే భుక్తి
కారణగుచున్నవి. తద్వత్తు ఆ ప్రకారముగాను ముక్తయే ముక్తి
కారణము న కాదు. ఇతి వివేకచూడామణౌ శ్రీ ఆదిశంకరాచార్య
వచః. కావున. గీ. వేయుఁజెప్పనేల? విను శబ్దజాలంబు
చిత్తవిభ్రమంబు సేయనదవి

ముక్తి దాన లేదు మొనయదు సత్యంబు
తెలివి మెరయ హరిని గొలువవె మనసా.

శ్రుతి. మద్భక్తి విముఖానాం హి శాస్త్రగర్తేషు ముహ్యతాం
న జ్ఞానం న చ మోక్షస్స్యాత్ తేషాం జన్మశతైరపి.

టీక. శాస్త్రగర్తేషు ముహ్యతాం శాస్త్ర సకలశాస్త్రములనెడి గర్తేషు మడుగులయందు ముహ్యతాం మునుగుచున్నట్టివంటి మద్భక్తి విముఖానాం మద్భక్తి నాయొక్క భక్తియందు విముఖాం సహ్యములైనట్టివంటియయు తేషాం ఆ జనులకు జన్మశతైరపి జన్మశతములచేతను జ్ఞానం జ్ఞానము మోక్షశ్చ ముక్తియు న స్యాత్ కలుగదు. ఇతి శ్రీమదధ్యాత్మరామాయణే శ్రీరామభగవద్వచః.

శ్లో. సంప్రాప్తే సన్నిహితే కాలే నహి నహి రక్షతి డుకృఞ్ కరణే
భజ గోవిందం భజ గోవిందం గోవిందం భజ మూఢమతే.

ఇత్యాది శంకర భగవద్వచః. వెండియుం.

గీ. దానవాంశములను ధరబుట్టి విప్రుల
? లోన పొంచ బుట్టుతేని వారి
మూలమెల్ల వినుము ముదమెప్పగ దెప్పెద
భూసురాన్వయాబ్ధి పూర్ణచంద్ర

గీ. పుత్రమిత్రకళత్ర సంపూర్ణవిభవ
మఖిలమును రోసి విడచి సన్యాసియయ్యు

మరల ననురాగియయి మహిం మసలుచుండు
రాత్రిసాంజకుఁడయినట్టి బ్రాహ్మణుండు.

ఉదాహరణము. రాత్రిసాంకలిమాంశ్రోత్య జాయంతే బ్రాహ్మణా ద్విజా

ఉ. కోడలితో తిట్లమర్క కాడు కంకాట్లకు నైంపక పాట్లకరాలికై
బోడితనంబు నొందితినిపృష్టిని జెందివివేకశూన్యుఁడై
గోడకు నేలకర్క మఱియు కొంపకు మోహము నొందివ్యాజముల్
వేదుకసల్పుచుండుగతి బోకరతందను జాంకభూసురుల్

గీ. తినను హంస్త్రీ జనముగాని తినకమింట్టి
చూపు జూచు చదక్షుగా సాలయ కిదు
మిమ్మ తెమ్మని కలహింతురేపు మిగుల
పూర్వదేవాంశజులనగు బోడిగాండ్రు

గీ. ఏమిచెప్పంద దుర్గతినిళ్లుతిరిగి
బుధ జనంబులు గనినగ పాలుపడక
యుంత కాలంబు డాసిన నసురగతులు
గడుసంతోషం డ్లాంతలబుడు దురనఘ.

ఉదాహరణము. "ఇంద్రో యతీన్ శాల్వావృకేభ్యః ప్రాయచ్ఛత్" ?
ఇతి తైత్తిరీయ శ్రుతిః. ఇంద్రః శిష్టకర్మయ యునయముఁడు
యతీన్ వేదోష్ఠుల యునయతులను సాలావృకేభ్యః తోలా
డేంద్లకొఱకు ప్రాయచ్ఛత్ శిక్షించెనని యర్థమయియున్నను..
ఇంద్ర శబ్దము నకు యముఁడని యర్థము చెప్పుటెట్లనిన

టీక. హే కౌంతేయ! ఓ అర్జునుఁడ తృష్ణాసంగసముద్భవం తృ
ష్ణా రాని వస్తువును కోరఁగఁబడునను సంగప్రాప్తమయిన విష
యములయందు మనః ప్రీతి గలిగియుంటవలనఁ బుట్టిన
రజః రజోగుణము చు రాగాత్మకం అను~~రంత్తమయినదాని~~
జనస్వరూపమయినదానిని గాను . విద్ధి తెలియుము.
తత్ మరిన సత్త్వమయంబగు ~~ఉ~~ రజోగుణము దేహినం
దేహిని అనఁగా కేవలనిగులగు వారిని కర్మసంగేన కర్మా
సక్తిచేత నిబధ్నాతి కట్టివేయుచున్నది. ఇతి భగవద్వాక్య
అధ్యాయము. ౧౪ శ్లోకము ౭

క. కులమును రూపును ధనమును
గలుగంగాఁ జేయుమనుచు కరమచు రక్తిన్
గొలుతురు దేవతల నాభువి
పలుమారును మరిగ సత్త్వపరులగు మనుజుల్.

తాత్క. శ్లో. దేవి భక్తజనోద్దామ దత్తానందోదయాంబికే
రూపం దేహి జయం దేహి యశో దేహి ద్విషో జహి?
పత్నీం మనోరమాం దేహి మనోవృత్త్యనుసారిణీం
పుత్రం దేహి ధనం దేహి సర్వకామాంశ్చ దేహిమే.

టీక. భక్తజన. భక్తజనులకు ఉద్దామ ఉత్కృష్టముగా
ఆనందసంతోషము యొక్క ఉదయ ఉదయముగల
దేవి ప్రకాశించుచున్న అంబికే ఓ పరమేశ్వరి! మేనాకు

రూపం రూపమును దేహి ఇమ్మా జయం జయమును దేహి ఇమ్మా
యశః కీర్తిని దేహి ఇవ్వుమా ద్విషః శత్రువులను జహి చం
పుమా మనోరమాం మనస్సును సంతోషింపఁజేసెడియు
మనోవృత్త్యను సారిణీం ఇష్టానుసారిణియయినటువం
టిందియు పత్నీం భార్యను దేహి యివ్వుమా। ధనం ధనమును
దేహి ఇవ్వుమా। సర్వకామాంశ్చ సమస్తకోరికలును దేహి
ఇవ్వుమా। ఇతి సప్తశతి మంత్రహాస్య.

స్వస్తి శ్రద్ధాం బుద్ధిం మేధాం యశః ప్రజ్ఞాం విద్యాం బుద్ధిం
శ్రియం బలమాయుష్యం తేజ ఆరోగ్యం దేహి మే హవ్యవా
హనా! హవ్యవాహన ఓ అగ్నిహోత్రుడా మే నాకు
స్వస్తి శుభమును శ్రద్ధాం ఆసక్తిందియు ప్రజ్ఞాం ప్రౌఢిమను
యశః కీర్తిని మేధాం ఊహను విద్యాం విద్యను బుద్ధిం
జ్ఞానమును శ్రియం ఐశ్వర్యమును బలం దారుఢ్యమును
ఆయుష్యం ఆయువును తేజః బ్రహ్మవర్చస్సును ఆ
రోగ్యం రోగరాహిత్యమును దేహి ఇవ్వుమా।

వ. ఇవ్విధంబున.

క. నరసురలోకసుఖంబులు
ధరధర్మము సేయఁగలుగు తథ్యం బనుచున్
గురుతరశీలము ననునరు
ఉరుఫలములఁ గోరి కర్మలొనరింతురా క్షన్

వ. ఇందుఁ జెప్పఁబడిన ధర్మమునకుదాహరణము.

॥ చోదనాలక్షణోర్థో ధర్మ ఇతి జైమినిసూత్రే. చోదనా లక్షణః వేదప్రతిపాద్యమయిన అర్థః అనిష్టాఽనన కేష్ట సాధనము ధర్మః ధర్మము. అనఁగా ననిష్టమును బుట్టింపక యిష్టమును గలుగఁజేయునట్టిదనుట ఇట్టి శ్రౌతస్మార్త నిత్యకర్మానుష్ఠాన ప్రవృత్త్యాత్మ మేధారంతముగాఁగల సత్కర్మ నిచయము ధర్మమనఁబడును అట్టి ధర్మమువలన ధనము ధనమువలనఁ గామభోగంబులుం గలుగుచుండును ధర్మార్థకామ ములయందు ధర్మంబుత్తమోత్తమంబనఁగునెట్లనిన

శ్రు. ధర్మే సర్వం ప్రతిష్ఠితం తస్మాద్ధర్మం పరమం వదంతి

౧ ధర్మే కృత్యాదికర్మలయందు అనఁగా సత్కర్మలయం దనుట
౨ సర్వం అర్థకామాదికమఖిలము ౩ ప్రతిష్ఠితం నిలుపఁబడినది అనఁగా ధనమున శుంభమును నసుఖమును ఉంచఁబడినదనుట తతస్మాత్ అందువలన ధర్మం ధర్మమును అనఁగాఁ గర్మననుట ౪ పరమం ఉత్తమముగాను వదంతి చెప్పుచున్నారు. ఇతి తైత్తిరీయశ్రుతిః. అదెట్లనిన.

సీ. అన్నదానంబున నమృతసమానాన్న
మమరులకుందుకుఁదమకేమరుననుచు
భూదానమిచ్చిన భూమీశ్వరత్వంబు
వచ్చెడి జన్మకుహెచ్చుననుచు

గృహదానమొనరింప బహుదివ్యమణిహేమ
ఘటితసౌధంబులు గలుగు ననుచు
వస్త్రదానంబున వరవర్ణనీయ మహా
గురు దుకూలంబులు దొరకుననుచు
నిట్లు సకల దానంబులనెనయగు ఫలము
లార్యులెఱింప మిగులనౌదార్యమొప్ప
మనుజులొనరించి తత్ఫలమనుభవింతు
రందునందును నిజమిది నందితాత్మ.

ఇందుకుం బ్రమాణవచనము.

శ్లో. సత్పాత్రదానేన భవేద్ధనాఢ్యః ధనప్రకర్షేణ కరోతి పుణ్యం
పుణ్యాదవశ్యం త్రిదివం ప్రయాతి పునర్ధనాఢ్యః పునరేవ భోగీ.

టీ. సత్పాత్రదానేన సత్పాత్రదానము చేతను ధనాఢ్యః ధనాధిపతిః భవేత్ అగును ధనప్రకర్షేణ ధనవిశేషము చేతను పుణ్యం పుణ్యకర్మలను కరోతి చేయుచున్నాడు పుణ్యాత్ పుణ్యకర్మలవలన అవశ్యం తప్పకుండ త్రిదివం స్వర్గలోకమును ప్రయాతి పొందుచున్నాడు. ఇ~~ట్టి~~ట్లి చటి సుఖమును అనుభవించి పునః తిరిగివచ్చి ధనాఢ్యః ధనవంతుండయి పునః తిరిగియు భోగీ భోగమును అనుభవించును. ఇత్యపంచిత జనవచః మఱియును. శ్రు. "ఏతద్వై మంఖ తోయాన్న గరాద్ధం ముఖతో స్తా అన్నంగంగా ధ్యాతే తోదయః"

టీక॥ ఏతత్ ఈ అన్నం అన్నము ముఖః జనుఁడు తన ప్రథమ వయస్సునందు అతిథికొఱకు భగవద్బుద్ధిచేత సాదర పూర్వకముగా రాద్ధంపై ఇవ్వఁబడెనా అట్టి ముఖతః ముఖ వృత్తిచేత అస్మై ఈ అన్నదాంత కొఱకు అన్నం అన్నము అరయసనన ఆ రీతినే విశేష సన్మాన పూర్వకముగా రాద్ధాతే కలుగుచున్నది మఱియు మధ్యవృత్తియనఁగా సాదర ముతోం అతిథికి నన్నము నిచ్చుట. అట్టిచైనా ఆ రీతినే మధ్య వయస్సునందును అధమ వృత్తి అనఁగా మొదట కసరికొని తర్వాత అన్నము నిచ్చుట. అట్టిచైనా యారీతినే వార్ధకదశయందును అన్నము కలుగుచున్నది. ఈలాగే దాతప్రతిగ్రహీతల వృత్తి తారతమ్యములనుబట్టి సకల దానములకుఁ గలఫలములు చెప్పఁబడెను. ఇతి తైత్తిరీయే "సాదత్త ముపతిష్ఠతే" పూర్వ జన్మమునందు నాకరికి వ్వానిది యిప్పుడు తనకుఁ గలదని పండితవాక్యము చెప్పుచున్నది. మఱియును

గీ. మతిని సాంత్వికులత్యంతకవి మిబలి మి
నెలమి క్రతువులు జేతురింపెనయ స్వర్గ
సుఖముఁ గోరుచు శత మఖుము ఖంబులెమెచ్చ
పడమి వేల్పులు సంతోషమునఁ జెలంగ

వ. తత్ప్రకారం చెప్పినన.

గీ. మంత్రి మంత్రార్థయాంజకతంత్రముయును

స్రుక్స్రువముఖోపకరణ విశిష్టవస్తువులను
హరిరూపమని కర్మ సలుపుచుండు
మతిన సాత్వికుఁడయినట్టి మనుజుఁడవని

ఉదాహరణము. (శ్రుతి) కర్తా క్రియాణాం సచ యజ్యతే
క్రతుస్స ఏవ తత్కర్మఫలం చ తస్య స్రుగాదియత్సాధన
మప్యశేషం హరేర్న కించి ద్వ్యతిరిక్తమస్తి.

టీక. క్రియాణాం కర్మలను కర్తా చేయువాఁడును స ఏవ ఆ శ్రీమహావిష్ణువేను. తత్కర్మఫలం చ ఆయజ్ఞ కర్మఫలమును స యేవ ఆ శ్రీమన్నారాయణ పరబ్రహ్మమేను. యత్ ఏ స్రుగాది సాధనమపి స్రుక్స్రువాది యాగసాధనములు గలవో తత్ అదియును స యేవ ఆ భగవంతుఁడేను. హరేః ఆ శ్రీమన్నారాయణమూర్తి కంటె వ్యతిరిక్తం మిగిలినది కించిత్ కొంచమయిన నాస్తి లేదు.॥ శ్రు.॥

"యజ్ఞో వై విష్ణుః. యజ్ఞము మూఁడు విధములు సప్త పాకయజ్ఞములు ఈ సకల యజ్ఞంబులకు నిఖిల లోకంబులకు నధిష్ఠాన దేవత విష్ణువై శ్రీ మహావిష్ణువే ఇతి తైత్తిరీయ శ్రుతిః

వ. ఇవ్విధంబున సకల ధర్మంబులు భగవత్స్వరూపంబని తెలిసి కొని. గీ. ఆగతాఖిలజనులకిష్టాన్నపాన
జన్యభోజ్యాది సౌఖ్యసంపదనమర్చి

దక్షిణాంబరచయము నరగూర్చి
భూరిసంభావనలం బొమ్ము పొందుపఱచి.

గీ. సకలసంభారములనిట్లు సంగ్రహించి
బ్రాహ్మణులను యాజకప్రతతిఁజేర్చి
మదిని సాత్త్వికవృత్తులు మరుగఁజేసి
హరియజ్ఞంబటంచును హర్షమొంద

వ. ఇట్లు.

గీ. భగవదర్పణబుద్ధి వేదాసనాది
సురలఁ బూజింప శ్రీహరి కరము మెచ్చు
స్వర్గముఖలోకసౌఖ్యమనర్గళముగ
నొసఁగుచుండును కరుణపెంపెసఁగ నెప్పుడు

వ. అనిన శిష్యుఁడిట్లనియె.

గీ. ఎవ్వఁడే దైవమును గొల్చు నింపుమీర
వానికా దైవమొసగూర్చు దాని ఫలము
~~[illegible]~~ నంచు వింటిమి సురలఁ బూజించఁ బ్రీతి
ఫలమొసంగుటయెట్లది పలుకుమయ్య

వచ. అనిన దేశికాగ్రణి యిట్లనియె.

గీ. అగ్నిముఖమున దేవతలారగింప
నెట్లుగా దేవముఖమున హరి భుజించి
దలఁప నే కర్మమున నెంతఫలము కలదొ

దానిచేయుచున్నఁడును దప్పు చెప్పదు

లక్ష్యము. శ్లో॥ భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరం
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి.

టీక. యజ్ఞతపసాం యజ్ఞములకును తపస్సులకును భోక్తా
రం దేవతారూపమునోక్త భోక్తలయినట్టియు సర్వలోకమ
హేశ్వరం సమస్తలోకములకు నియామకుఁడయినట్టియు
సర్వభూతానాం సమస్తప్రాణులకును సుహృదం ఉపకా
రియయినట్టియు సర్వసాక్షియయినట్టియు మాం నన్ను
జ్ఞాత్వా ఎఱింగి శాంతిం సం~~సా~~ సారోపరతిని ఋచ్ఛ
తి పొందుచున్నాఁడు ఇతి భగవద్వాచః (అ. ౫. శ్లో ౨౯)

శ్లో. అహంహిసర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ

టీక. సర్వయజ్ఞానాం సకల శ్రౌత స్మార్త కర్మలను భోక్తాచ అ
నుభవించువాఁడును ప్రభుశ్చ ఫలము నిచ్చువాఁడును
అహమేవహి నేనే కదా. ఇతి భగవద్వాచః (అ ౯ శ్లో ౨౪)

గీ. పొసఁగఁ గర్మలచేఁ గన్నపుణ్యఫలము
భుక్తమగునంతకే బదుదురు పుడమిమీఁద
కర్ములకెందు నిత్యసౌఖ్యంబుగలదె
యెన్నిపాట్లనుబడిన దామేమియు డిన

ప్రమాణవచనము. శ్లో॥ తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి.

ఏవం త్రయీం ధర్మమను ప్రపన్నా
గతాగతం కామకామాలభంతే.

టీక. తే. స్వర్గమునందు శ్రేష్ఠములయిన దేవభోగములను భవించుచున్న జనులు విశాలం విస్తారమయిన తం స్వర్గలోకం ఆ స్వర్గలోకమును భుంక్త్వా అనుభవించి పుణ్యే పుణ్యము క్షీణే సతి క్షీణించుచుండగా మర్త్యలోకం మనుష్యలోకమును విశంతి ప్రవేశించుచున్నారు ఏవం ఈ ప్రకారముగా త్రయీం ధర్మం వేదకర్మమును అనుప్రపన్నాః ఆశ్రయించినట్టి కామకామాః విషయములను కోరెడిజనులు గతాగతం పోవుచువచ్చుచుండుటను లభంతే పొందుచున్నారు. ఇతి భగవద్వచః. ౯వ అ. శ్లో. ౨౧.

వ. అనిన శిష్యుం డిట్లనియె.

మ. జగతిన్ యజ్ఞముఖాది ధర్మములు నిష్కామంబుతోఁ జేసినన్
సుగతిం గాంతురు మర్త్యరాశ్రనుచు నీవాడితే బుధగ్రామణుల్
నిగమార్థంబులఁ దెల్పుచుండు దురసుచున్ నే వింద మోయయ్యయా
పగిడింజేసిన ముక్తినొందఁ దగదే భవ్యప్రభావ్యాప్తిన్.

వ. అనిన విని గురువిభుం డిట్లనియె.

గీ. పుష్పితములగు శాఖల పోలి ఫలము
లలరఁ దెల్పెడి యర్థవాదులకు నుబ్బి
కర్మచే నిత్యసౌఖ్యంబు గలుగు

ననుచు నమ్ముటెల్లను వ్యర్థంబు సుమ్ము పుత్రా

వ. అర్థవాదులనఁగా, గర్మఫలస్తవరూపమయిన శ్రుతులు అవి.

కారిక. శ్లో. యామిమాం పుష్పితాం వాచం ప్రవదంత్య విపశ్చితః
వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః

టీక. హే పార్థ ఓయి యర్జునుఁడా అన్యత్ కర్మకంటె వేరయినది నాస్తి లేదు ఇతి ఈ ప్రకారముగ వేదవాదరతాః వేదవేదము యొక్క వాద అర్థవాదములయందు రతాః ఆసక్తులయినట్టియు వాదినః వాదశీలురయినట్టియు అవిపశ్చితః పండితులు గానివారు యాం ఏ ఇమాం ఈ పుష్పితాం పుష్పించిన లతవలె రమ్యమయిన వాచం కర్మఫలస్తవప్రతిపాదక వాక్యములను వదంతి చెప్పుచున్నారో అనియు.

శ్లో. త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున.

టీక. అర్జునా ఓ యర్జునుఁడా వేదాః వేదములు త్రైగుణ్యవిషయాః సత్వరజస్తమోగుణ విశిష్టులయిన పురుషులకుం దత్తదనురూప ఫలములను గలుగఁజేయునట్టివి కావున నీవు నిస్త్రైగుణ్యః త్రిగుణాతీతుఁడవును భవ కావుము. అనఁగా గుణములు ప్రకృతి ధర్మములని యెఱుంగుమనుట ఇతి భగవద్వాక్యము అధ్యాయము — ౨ శ్లోకములు ౪౨, ౪౫.) వ. ఇదియునుం గాక

గీ. స్వర్గకాముఁడయిన వాఁడె పో యజ్ఞంబుఁ జేయవలయు
ననుచుఁ జెప్పె విధులు

దానముక్తిఁ గలుగ దప్పదటన్నను

నగరె బ్రహ్మవిదులు నగరె నగరె. లక్ష్యము.

॥ జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేతేతి తైత్తిరీయశ్రుతిః

టీక. స్వర్గకామః స్వర్గమును గోరినవాఁడు జ్యోతిష్టోమేన యజ్ఞములచేతను యజేత ఇంద్రాది దేవతలను పూజించవలయు నని చెప్పుచున్నదిగాని మోక్షార్థి చేఁజేయఁదగినదని చెప్పలేదు.

గీ. సచ్చిదానంద జలధిలో సకలభూత
ములను బుద్బుదమాడ్కిని పుట్టిపుట్టి
గిట్టుచున్నవి కర్మచే బట్టి త్రిప్ప
కామమోహాదుల తెరాఁగురాత్మ గలుగు కతన

గీ. అహమహంబను బుద్ధిచే నఖిలక్రియలు
గడపుచును నేటమాత్రంబు కర్మఫలము
విడిచితినటంచుఁ బలికిన విదుడు వారి
వృత్తి ప్రత్యగభిన్నగ వెలయుచునికి

వ. మఱియును సంభవజ్ఞానంబె ఆంగనివాఁడయినను.

గీ. ఫలము వలదని మన సొప్పఁబలికి ~~[illegible]~~ క్రతువు
భగవదర్పణముగఁ జేయు నిగమనిధికె
స్వర్గసుఖమయినఁ గలుగుట సాధువృత్తి
నట్లొనర్చని దుర్మతికేదియుఁ గలదె. లక్ష్యము.

శ్లో. అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ

నతుమాం మభిజానంతి తత్త్వే నాతశ్చ్యవంతి తే.

టీక. సర్వయజ్ఞానాం సమస్త శ్రౌత స్మార్త కర్మలకు భోక్తాచ అనుభవించువాఁడును ప్రభుశ్చ నియామకుండును అహమేవహి నేనేకదా మాం నన్ను తత్త్వేన యదార్థముచేత తే ఎవరు నాభిజానంతి ఎఱుఁగరో తత్తువారలు అతః అట్లు భగవంతుడనయున నన్నెఱుంగక చేయునది అను అవిధిపూర్వకమయిన ఆయాగఫలమువలన చ్యవంతి జారుచున్నారు. ఇందుకు ఫలితార్థము. భగవత్తత్త్వమును గుర్తెఱుంగక చేసెడి కృత్యాది సకలకర్మలు నిష్ఫలమగుననుట. ఇతిభగవద్గీత అధ్యాయము.౯. ౨౪వ శ్లోకము.

గీ. కామవాఞ్ఛంబు ధర్మంబు కర్తకొసఁగి
గొప్పసంసారిగాఁజేసి కెలనెడి ధర్మ
మునను రెంపొందు కర్మకు ముక్తి నిచ్చు
శక్తి లేదని వేదాంతసమితిబలుకు

లక్ష్యము:-॥శ్రు॥ నకర్మణా నప్రజయా ధనేన త్యాగేనైక అమృతత్వమానశుః. టీక. కర్మణా యజ్ఞ కర్మచేతను ప్రజయాచ సంతానముచేతను ధనేన ధనముచేతను అమృతత్త్వం మోక్షమును నానశుః పొందరయిరి ముఖ్యమయిన బ్రహ్మవేత్తలు త్యాగేన ప్రారబ్ధవశమగు దేహకర్మా కర్మఫలంది అనాత్మత్యాగమువలన అమృతత్త్వం ముక్తిని అనశుః పొందిరి

ఇతి తైత్తిరీయోపనిషది. ఇట్లగు టంజేసి,

గీ. ఫలముగోరి కర్మములఁ జేయువారలు
కృపణులంచు దెలియుమెప్పుడు మదిని
జగతి వారె నిత్యసంసారులరయ
క్రిందు మీదు నై తిరుగుచుందురనఘ.

లక్ష్యము. శ్లో. దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ
బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః

టీక. హే ధనంజయ ఓయర్జునుఁడా, బుద్ధియోగాత్ నిష్కామబుద్ధియుక్తకర్మకంటె కర్మ కామ్యకర్మము. దూరేణ దూరమయినందుచేత అవరం నికృష్టమయినది. ఏ కారణము వలన ఫలహేతవః కామ్యఫలముతే కారణముగాఁగల వారలు కృపణాః నికృష్టులయిన సంసార్లు.

ఇందుకు శ్రుతి. "యో వా ఏతదక్షరమవిదిత్వాస్మాల్లోకాత్ ప్రైతి స కృపణః" ఎవఁడు నాశరహితమయిన పరమాత్మను దెలియఁడో వాఁడు పరలోకమునకుఁ బోయినను కృపణుఁడని చెప్పఁబడును. కావున బుద్ధౌ జ్ఞానవిషయమయి శరణం కర్మమును అన్విచ్ఛ ప్రార్థింపుము. ఇందు బుద్ధౌశరణమను వాక్యమువలన కర్మ అంతఃకరణశుద్ధికిఁ గారణమని తెలియునది.

అవతారిక.

వ. చిత్తశుద్ధియయిన నేగాని జ్ఞానము గలుగదనే నిరాంధిక కాఅను

తిరిగి బోధించుచున్నాఁడు.

శ్లో. బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృత ~~దు~~ దుష్కృతే
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలం

అధ్యాయము—౨. శ్లోకము ౫౦.

టీక. బుద్ధియుక్తః ప్రాప్త్యప్రాప్తులయందు సమత్వబుద్ధితో గూడినవాఁడు ఇహ ఈలోకమందు ఉభే రెండయిన సుకృతదుష్కృతే పుణ్యపాపములను జహాతి త్యజింపుచున్నాఁడు॥ తస్మాత్ ఆ కారణమువలన యోగాయ బుద్ధియోగమునకొఱకు అనఁగా జ్ఞానమునకొఱకనుట యుజ్యస్వ యుక్తుఁడవగుము అనఁగా చిత్తశుద్ధిగలవాఁడవగుమనుట. తథాహి అది యుక్తముగదా అనఁగా చిత్తశుద్ధికొఱకు ఫలమునుగోరక సత్కర్మజేయుటమంచిదేగదాయనుట యోగః ప్రాప్త్యప్రాప్తులయందు సమత్వబుద్ధి అనగా సుఖము గలిగినప్పుడు పొంగకయు దుఃఖము గలిగినప్పుడు క్రుంగకయు ఇట్లు గర్వదైన్యములను పొందక సహించియుండడమనుట కర్మసు కర్మములయందు కౌశలం కుశలత్వము అనఁగా నేర్పు ఇదే సుమాయనుట ఇందువలన కర్మఫలరహితముగాఁజేసిన చిత్తశుద్ధి కలుగుననియు ఇట్టివారు నిత్యసంసారులనియుఁ దెలుపఁబడుచున్నది. గీ. అనుగుణులకెనవిని శిష్యుఁడఖిలకర్మ
ఫలము నిత్యంబుగాదని తెలిసెనింక

దానిఁ జేయుంగ నేటికి దానదినంబు
ననిన గురువరుం డతనితో ననియె నగుచు

గీ. కర్మ సాధన భక్తి విజ్ఞాన యోగ
ములకుఁగల తారతమ్యంబుఁ దెలియు టెటుల
దెలియఁ బలికితి సత్కర్మ ఫలము నిట్టి
ధర్మమునకల మానుమని తెల్పఁ దలఁపడు.

గీ. ప్రథమసత్కర్మములలోనఁ బొసఁగ నొకటి
యయినఁ జేయని జనునికి యవ్విధి యయిన
పొందఁబడు టెట్లు నట్టి ప్రకృతి కర్మ
మానఁగాదదు నిజమిది మానితిలక.

॥ లక్ష్యము ॥

శ్లో. నాయం లోకోస్త్యయజ్ఞస్య కుతోన్యః కురుసత్తమ.
హే కురుసత్తమ. ఓ కురుశ్రేష్ఠుఁడా - అయజ్ఞస్య యీ పయి
ని చెప్పిన నిఖిలయజ్ఞములలో నొకటియుఁ జేయనివానికి
అయం ఈ సర్వప్రాణిసాధారణమయిన లోకము నాస్తి
లేదు. అన్యః ఇతరనికి పరలోకము కుతః ఎక్కడిది? ఇతిభ
గవద్వచః. (అధ్యాయము ౪ శ్లోకము, ౩)

వ. ఇదియును గాక.

క. కర్మోద్భవంబు దేహము
కర్మయు దేహోద్భవంబుగా వనజముఖా

కర్మను విడువంగదగదు
నర్మితి దేహంబునందు నంతకు వఱకు.

వ. అయిన నిందు మఱియొక విశేషంబు గలదది వినుము.

క. పొసఁగ నెందాక దేహాత్మబుద్ధి గలుగు
నంతదనుకను కర్మల నాచరించ
నుండిన కులాశ్రయంబులు కొలువదును
దాననరకంబు జొప్పడు తప్పకనఘ లక్ష్యము.

శ్లో. యావచ్ఛరీరాదిషు మాయయాత్మధీః
స్తావద్విధేయో విధివాదకర్మణాం

టీక. శరీరాదిషు శరీరాదులయందు మాయయాత్మధీః మాయయా అజ్ఞానముచేతను ఆత్మధీః తానను బుద్ధి యావత్ ఎంతవఱకునుండునో తావత్ అంతమట్టుకు విధివాదకర్మణాం వేదవిహితకర్మములకు విధేయః బద్ధుఁడయియుండవలెను ఇత్యధ్యాత్మరామాయణే శ్రీరామభగవద్వాచః అని వెండియు నిట్టి కేవలనరుల తురీయాశ్రమధర్మంబెఱింగింపం దలంచి యిట్లనియె.

క. మహితతురీయాశ్రమమున నందు మనుజులరయ
నర్హులగునట్టు విహరించి యఖిలజనులు
నగుననంగను సత్పాత్రి నమరఁగాంచి
సత్యలోకంబు జొత్తురు సాధుతిలక

వ. అని యిట్లు మతిసన్న్యాసత్యాగుల కామకర్మఫల ప్రకారంబుల
తెలియంగ నంగీకరించు మఱియు దేవతాంశోద్భవులగు మానవుల
ధర్మమార్గంబు దెలుపం దలంచి యిట్లనియె.

౧౦ దేవతాంశజులగు మనుజుల
సదాచార నిరూపణఘట్టము.

గీ. యజ్ఞదాన తపః కర్మలరయ పావ
నంబులగుటను సుర తెన్న నవని దేవ
తాంశచే(గల్గు జనానురుల కఖిల ఫలవి
వర్జితంబుగ(జేతురు వరకులాం(శ)
మోచితంబగు ధర్మంబునా భ. గీ. అ. ౧౮
లక్ష్యము. శ్లో. యజ్ఞదానతపః కర్మ నత్యాజ్యం కార్యమేవతత్
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణాం
ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలానిచ
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమం

టీక. యత్ ఏది యజ్ఞ దానతపః కర్మ యజ్ఞదానతపో
రూపమయిన కర్మమో తత్ ఆ కర్మము కార్యం చేయందగినది
నత్యాజ్యం విడువందగినది కాదు యజ్ఞః యజ్ఞమును,
దానం దానమును తపశ్చ తపస్సును, మనీషిణాం పండితు
లకు పావనాని పవిత్రములయినవి హే పార్థ ఓయి అర్జున
ఏతాని ఈ పూర్వోక్తములయిన కర్మాణి కర్మములు సంగం

మమకారమును, ఫలాని చ, ఫలములను త్యక్త్వా విడిచి కర్త
వ్యాని చేయఁదగినవి ఇతి ఇట్లని నిశ్చితం నిశ్చయింపఁబడిన
ఉత్తమం ఉత్కృష్టమయిన మే నా యొక్క మతం సమ్మతము
ఇతి భగవద్వచనము. (గీ. ౧౮ అ. ౬ శ్లోకము.)

గీ. కర్మమానని ఫలవిగాదు ఘనంతా శకి
నెప్పుడటించు బుద్ధి నెఱిఁగి గాదె
బుధులు కర్మఫలము బౌనాడి పుణ్యపా
పంబులంటకుండ బ్రతుకుటనఘ.

లక్షణము.

శ్లో. నహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః
యస్తు కర్మఫలత్యాగీ సత్యాగీత్యభిధీయతే

టీక. హి ఏకారణమువలన దేహభృతా దేహధారిచేత అశే
షతః సమస్తములయిన కర్మాణి కర్మములను త్యక్తుం విడుచు
టకు అశక్యం నశక్యం శక్యముగాదో యస్తు ఎవ్వఁడైతే కర్మఫల
త్యాగీ కర్మఫలమును త్యజించుచున్నాఁడో సః వాఁడు
త్యాగీ పుణ్యపాపకర్మఫలత్యాగము గలవాఁడని అభిధీయ
తే చెప్పఁబడుచున్నాఁడు. ఇతి భగవద్వచః (అధ్యాయ
ము. ౧౮ శ్లో ౧౧.).

గీ. నేను నేననుభావంబు మాని లిప్త
మొందకున్నట్టి బుద్ధి నింపొంద నెవఁడు

విరుతుచుండును వాండె సంసరణముక్తు
డనుచు మెలంగుదు రాంతి సారబుధులు.

లక్ష్యము.

శ్లో. యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే.
హత్వాపి స ఇమాంల్లోకాన్ న హంతి న నిబధ్యతే.

టీక॥. యస్య ఏ పురుషునికి అహంకృతః నేనను నెడి భావః భావము నాస్తి లేదో యస్య ఎవని యొక్క బుద్ధిః బుద్ధి న లిప్యతే లిప్తము కాదో సః వాండు ఇమాన్ లోకాన్ ఈ జనులను హత్వాపి చంపియు న హంతి చంపినవాండు కాడు న నిబధ్యతే సంస్కార బద్ధుండును కాండు అనంగా స్వధర్మము గు యుద్ధమందు జంపినాండో దోషము లేదు కాంబట్టి యుద్ధము సేయుమనుట ఇతి భగవద్వచః అధ్యా ౧౮ శ్లోకము ౧౭,

క. కావున సాధులగర్వులు
భావంబుల గారవిసుము భవ్యాత్మక నా
కావిధమంతయుఁ దెల్పెద
ధీవరుతా నానంగ ధారతమె యియన్

సీ. వేదవేదాంగాది వివిధ విద్యలు హెంతి
నిజమె యుంగుటకున్నై నేర్చువారు
శ్రీవిభుసంతోష సిద్ధికైయి బుధుల సు
దాన ధర్మంబుల దనుప్పవారు

భగవదాజ్ఞ నుకర్మవదలఁగఁదగదంచు
నదపిన నడపింప నడచువారు
తపములోశుని జేర్చ తగిన వంచనియెంచి
నిర్మలమతినవి నెరపువారు
ముక్తికొఱకుహరినిముచుకుందవరదుని
నఖిలభద్రదాయినమిత శ్రేష్ఠు
విశ్వవిభుని మదిని వేడుకఁగొలిచెడి
వారు దేవతాంశవరలువారు
గీ. దయయు సత్యంబు దప్పక తగిన కాలమ
నతిథిపూజలు జేయుచు నఖిలక్రియలు
భగవదర్పణంబు జేసి చేఁబరపువారు
దేవతాంశోద్భవులు భువి దేవియయు మర్త్య
వ. ఇదియునుంగాక.
సీ. ఉరుగుణాకరవిను మోరం తత్సదితి యను
మూఁడునామంబులుం మున్నె పరమ
పురుషునకొప్పారు బొంసఁగనందునులన
బ్రాహ్మణుల్ వేదముల్వరక్రతువులు
నుదయించెమోరత్రేభ్యమదిగల్లు భూసురుల్
తత్సత్ యనుచును తగవచించి
ఫలమెల్ల విడనాడి పరమార్థబుద్ధిచే

సకలకర్మంబులుసలుపుచుండు
నమరవరులుమెచ్చ నారౌర సభలలోన
సకలలోకవితతి సన్నుతింప
ననవరతముమదిని నమలవరాంసత్వసం
పద మెసంగ మిగుల ముద మెసంగ

లక్ష్యము. శ్లో. ఓంతత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చవిహితాఃపురా

టీ. ఓం తత్సత్ ఇతి ఓంతత్సత్ ఇట్లు త్రివిధః మూఁడు ప్రకారము లుగలిగిన బ్రహ్మణః పరమాత్మయొక్క నిర్దేశః నామోచ్చారణము స్మృతః చెప్పఁబడెను తేన దానిచేత బ్రాహ్మణాశ్చ బ్రాహ్మణులును పురా పూర్వకాలమునందు విహితాః నిర్మింపఁబడినవి అం దుచేతి భగవద్వచః అధ్యాయము ౧౭ శ్లో — ౨౩

శ్లో. తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపః క్రియాః
దానక్రియాశ్చవివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః

టీక. మోక్షకాంక్షిభిః ముముక్షువులచేత తదితి తత్ అనెడి బ్రహ్మాభిధానమును ఉచ్చరించి ఫలంఫలమును అభిసంధాయ కోరక యజ్ఞతపః క్రియాః యజ్ఞతపః క్రియలును వివిధాః నానావిధములయిన దానక్రియాశ్చ దానక్రియలును క్రియంతే చేయఁబడుచున్నవి. మఱియు అ. ౧౭ శ్లో ౨౬

సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే

ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థయుజ్యతే

టీక. హే పార్థ ఓ యర్జునా సద్భావే కద్దనుటయందును
సాధుభావే శ్రేష్ఠమనుటయందును సదితి సత్ అనెడి పద
త్ ఈపదము ప్రయుజ్యతే ప్రయోగింపఁబడుచున్నది.
తథా అలాగుననే ప్రశస్తే ప్రశస్తమయిన కర్మణి కర్మ
మందునను సచ్ఛబ్దః సచ్ఛబ్దము యుజ్యతే ప్రయోగింపఁ
బడుచున్నది ఇతి భగవద్వచః అధ్యాయము ౧౭ శ్లో ౨౬.

వ. కాప్పన.

గీ. ఫలముఁగోరక కర్మనిష్ఠంగ జేయు
గరిమచే విధి వ్రాతల కవిమినాంది
తిరుగుచుండగ బహుకాల మరుగ నంత
గురుని కృప నిత్య సుఖముచే కాందురనఘ.

లక్ష్యము.

శ్లో. ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః
అనేక జన్మసంసిద్ధ స్తతో యాతి పరాంగతిం (అ.౬ శ్లో౪౫.

శ్లో. బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే
వాసుదేవస్సర్వమితి సమహాత్మా సుదుర్లభః
(అధ్యాయము ౭ శ్లోకము ౧౯.

టీక. యోగీ కర్మనిష్ఠుఁడు ప్రయత్నాత్ ప్రయత్నము వలన
యతమానస్తు మోక్షముకొఱకు యత్నముచేయుచున్న

ప్రారంభించెట్లొకా, తద్విధంబె జింగింపవేయుచు చెప్పిన సద్వి
శేషం బిట్లనియెను.

గీ. వేదవాద రతులు విధివిధేయంబులై సలుపు నవ్వి ధ
ప్రణవము పలికి బలికి.
ఫలముం గోరుచుండు లలిను ధర్మార్థకా
మములఁ దగులు వారి మార్గమిదియ లస్త్యము.

శ్లో. తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదాన తపః క్రియాః
ప్రవర్తంతే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినాం

టీక. తస్మాత్ - ఆ కారణమువలన విధానోక్తాః శాస్త్రోక్తములైన బ్రహ్మవాదినాం వేదవాదులయొక్క యజ్ఞదాన తపః క్రియాః యజ్ఞదాన తపస్సులనియెడి క్రియలు సతతం ఎల్లప్పుడును ఓమితి ఓం అని ఉదాహృత్య ఉచ్చరించి ప్రవర్తంతే ప్రారంభింపబడుచున్నవి. ఈ శ్లోకము తరువాయి శ్లోకము మోక్షార్థులకొరకు తత్సత్ అని పలుకబడుచున్నట్లు తెలుపుటవలన ఈ అనుష్టుప్ ధర్మార్థ కామనిష్ఠుల ధర్మములను బోధించుచున్నదని చెప్పబడెను. ఇతి భగవద్వాక్యం

ఆ శ్లో-౨౮. గీ. శ్రద్ధ చేతఁ జేయఁగ సకల సత్క్రియలను
సదితి యనుచు బుధులు సాటుచుండ్రు
శ్రద్ధ లేక చేయు సకల సత్కర్మల
నసదటండ్రు మేలు పొసఁగదండ్రు

లక్ష్యము.

శ్లో. యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే
కర్మచైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే

టీక. యజ్ఞే యజ్ఞమందును తపసి తపస్సునందును దానే చ దానమునందును స్థితిః నిష్ఠ యాంకః ఏదో సా అది సదితిచ సత్ అనియు ఉచ్యతే పలుకబడుచున్నది తదర్థీయం ఆ భగవదర్థీయమయిన కర్మ కర్మమును సదితి సత్ అని అభిధీయతే పలుకబడుచున్నది. ఇతి భగవద్వచః. అ౧౭శ్లో౨౭

శ్లో. అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ.

టీక. హే పార్థ ఓయి యర్జున అశ్రద్ధయా అవిశ్వాసముచేత యత్ ఏ హుతం హోమము కృతం చేయబడినదో తపః తపస్సు తప్తం చేయబడినదో తత్ ఆ సమస్తమును అసదితి అసత్తని ఉచ్యతే పలుకబడుచున్నది. తాదృశమది ఇహ ఈలోకమందును నచ ఫలింపదు ప్రేత్యచ లోకాంతరమునందును న ఫలించదు ఇతి భగవద్వచః అ౧౭శ్లో౨౮

వ. అనిన విని శిష్యుండిట్లనియె.

గీ. పాపపుణ్యములను బరికించు సంక్షేప
ముగను దెలుపుమయ్య నిగమఘనరతి
ననిన గురుఁడు పలికె నపకారముపకార

మనసి పాపపుణ్యములఁగఁజెల్లు. లక్ష్యము.

శ్లో. పరోపకారాయ పుణ్యాయ పాపాయ పరిపీడనం ఇతిపం
డితవచః॥

గీ. పాపకర్మ నరకతాపంబునకు నొప్పు
పుణ్యమింద్రలోకమునకు తుఁజేర్పు
భక్తి ముక్తి నిచ్చు పరమ విజ్ఞానంబు
బ్రహ్మతుర్యపాదపదవి నొసఁగు

వ. అని పలికి మఱియు నిట్లనియె.

గీ. భువిని గలుగు సకల భూతంబు లిచ్ఛంగ
త్రిగుణములను మిగుల త్రిగుణములను
జెందుచుండు నందు జేశల సంపద
నొందు ననియు పరము జెందు ననఘ

వ. అట్టి దేవతాంశములు గావారియందు గొందఱు

గీ. సంగరహితులగుచు సకల కర్మంబులు
హరి సమర్పితముగ నమరఁజేసి
ఫలము నొందరెప్పుడు పరిశుద్ధ సాత్వికుల్
విష్ణుభక్తులగుట విమలచర్య

లక్ష్యము.

శ్లో. బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతియః
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా

టీక. యః ఎవ్వఁడు కర్మాణి సమస్తకర్మములను బ్రహ్మణి పర
మాత్మయందు — ఆధాయ ఉంచి సంగం — ఆసక్తిని త్యక్త్వా
విడిచి కరోతి చేయుచున్నాఁడో సః వాఁడు అంభసా ఉదకము
లచేత పద్మపత్రమివ తామరాకువలెనే పాపేన పాపముల
చేతను నలిప్యతే అంటఁబడఁడు. ఇతి భగవద్వచః. అ౫శ్లో౧౦

గీ. విష్ణుభక్తి నొంది వెలసిన మనుజుండు
బుధజనంబులెల్ల పొగడ నెగడి
కర్మములకు మూలకారణంబయినట్టి
త్రిగుణములను విడిచి తేజరిల్లు.

కారికే. శ్లో. మాంచ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
సగుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే.

టీక. యః ఎవ్వఁడు మాంచ నన్ను అవ్యభిచారేణ నిశ్చలము
యిన భక్తియోగేన భక్తియోగముచేత సేవతే సేవించుచున్నా
డో సః వాఁడు ఏతాన్ గుణాన్ సకలకర్మలకుఁ గారణమయిన
సత్వరజస్తమోగుణములను అతీత్య అతిక్రమించి
బ్రహ్మభూయాయ బ్రహ్మభావనకొఱకు కల్పతే సమర్థుఁ
డగుచున్నాఁడు ఇతి భగవద్వచః అ౧౪శ్లో౨౬.

గీ. పరసుఖంబునకును పరమపదంబున
కాశ్రయంబు విష్ణుఁడచ్యుతుండు
నరయ బ్రహ్మమునకు నతఁడె రూపంబగు

నతనిఁ గాంచువ ముక్తిఁ గలుగు టరుదె?

లక్ష్యము. శ్లో॥ బ్రహ్మణోహి ప్రతిష్ఠాహ మమృతస్యావ్యయస్యచ
శాశ్వతస్యచ ధర్మస్య సుఖస్యైకాంతికస్యచ

॥టీక॥. హి ఏకారణము వలన బ్రహ్మణః పరమాత్మకు ప్రతిష్ఠా విగ్రహరూపము అహం నేను అవ్యయస్య నాశనము లేనట్టి అమృతస్యచ మోక్షమునకును ప్రతిష్ఠా ఆశ్రయము అహం నేను శాశ్వతస్య నిత్యమయిన ధర్మస్యచ ధర్మమునకును ప్రతిష్ఠా ఆశ్రయము అహం నేను ఐకాంతికస్య ముఖ్యమయిన సుఖస్యచ సుఖమునకు ప్రతిష్ఠా ఆశ్రయము అహం నేను అయి అయున్నాను ఆకారణము వలన నన్ను సేవించెడి భక్తియోగి బ్రహ్మభావనకు సమర్థుఁడగుచున్నాఁడు అనఁగా తురీయాతీతముక్తికి సమర్థుఁడగుచున్నాఁడు అనుట. ఇతి భగవద్వచః అధ్యాయము ౧౪ శ్లోకము ౨౭.

వ. అనిన విని శిష్యుండిట్లనియె.

గీ. కర్మయోగ ప్రచారంబు కర్మపర్వ
ముగను దెల్పితివఖిలము నిగమఫణితి
నింక సాధన యోగంబు నింపుమెరయ
దెలుపఁ గదవయ్య గురువర్య లలితచర్య.

వ. అనిన నగ్గురువరుం డిట్లనియె నయ్యభ్యాస యోగంబు

యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణా సమాధులనియెడి యష్టాంగంబులతోడంగూడి మంత్రల యహంతత్తారకాది నామంబులచే ప్రసిద్ధంబయ్యుండు దానినిరువదినాల్గు సంవత్సరంబులు సాధన జేయు మేధాజనశతంబులో నొకరిద్దఱు సాధకులగుదురని హఠదీపికాది గ్రంథంబులెఱింగించునిది దీర్ఘాయురారోగ్యవంతులగు కృతాది యుగత్రయంబునందు సుంగరు సాధనజనాళికి స్వేచ్ఛామరణంబునకు మిగుల నుపయోగంబుగా నిప్పటి జనంబులకతికఠినంబయియ సాధ్యంబయియుండునట్టి దానినిప్పుడు వర్ణింపంబనియేమనిపతికి యయినను సూత్రప్రాయంబుగాఁ గొంతఁ దెలుపం దలంచి వెంకయయునిట్లనియె.

౧౧. స్వేచ్ఛామరణఫలవిచారఘట్టము.

గీ. హఠము మొదలగు ధారణలరయ నిష్ఠ
మయిన వేళను తన తను త్యాగమునకు
మిగుల నుపయోగమగునట్టి యోగి తనువు
విడువఁ దలఁచిన వేళదా విమలబుద్ధి

గీ. యోగసాధనశక్తి నివేగఁబూని
ప్రణవమానకర్థమగుం హాంతి పాదములను
దశమదినెప్పి బ్రహ్మరంధ్రము నుఖంచి
జనఁగ సాలోక్యముక్తికి సాధులిలను.

౮ త్య్రము.

శ్లోకము. సర్వద్వారాణి సంయమ్య మనోహృది నిరుధ్య చ
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణాత్

టీక॥ సర్వద్వారాణి నవద్వారములను సంయమ్య, తిన్నగా నియమించి హృది. హృత్కమలమందు మనః. మనస్సును నిరుధ్య చ అరికట్టియు అప్పుడు వశీకృతమయిన మనస్సుచేతను హృత్కమలమును చుట్టి నూర్ధ్వగామియైన నాడిచేతను ఊర్ధ్వమున కెక్కించి మూర్ధ్ని శిరః ప్రాంతమయిన భ్రూమధ్యమందు ఆత్మనః తనయొక్క ప్రాణవాయువులను యోగధారణా యోగములయొక్క ధారణను ఆస్థితః ఆశ్రయించినవాడయి అ. ౮ శ్లో. ౧౨.

శ్లో. ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిం

టీక. బ్రహ్మ బ్రహ్మవాచకమయిన ఓమితి ఓమనెడి ఏకాక్షరం ముఖ్యమయిన వర్ణము వ్యాహరన్ ఉచ్చరించుచున్నవాడయి మాం ఓంకారవాచ్యుడయిన నన్ను అనుస్మరన్ చింతించుచున్నవాడయి దేహం శరీరమును త్యజన్ త్యజించుచున్నవాడయి యః ఎవ్వడు ప్రయాతి పోవుచున్నాడో సః వాడు పరమాం ఉత్కృష్టమయిన గతిం మోక్షస్థానమును యాతి పొందుచున్నాడు. ఇతి భగవద్గీతాః అ. ౮ శ్లో. ౧౩

వ. ఇదియె సాలోక్యముక్తియు సాష్టిత్వముక్తియు ననం
బడునని తెలిపెడు శ్రీగాగ్రనిదె.

శ్రు. ~~సా~~ ప్రమాణము. సాష్టితాగ్ం సమాన లోకతామాప్నో
తీత్యుపనిషత్. టీక. సమానలోకతాం ఏకలోకరూపమయి
న సాష్టితాం ఐక్యమును ఉపాసకుడు ఆప్నోతి పొందు
చున్నాడు. అనగా నభ్యాసయోగి స్వలోకము
ను పొందునని. ఇత్యుపనిషత్ గాయె. ఇది కష్టసాధనము
తోగూడిన సాలోక్యముక్తి. ఇవ్విధంబున.

గీ. ప్రణవరూపుడయిన పద్మనాభునియొద్ది
నిలుపక సుహారంబు సలిపెనేని
దారవముక్తి నేగ తలపోయ నమ్మూర్తి
వాని వేరణి ధరణి వరలునతడు.

లక్ష్యము.

కే. ధారణాయోగసమర్థులు
గారదములు గాని ముక్తి గలుగదు దానన్
ఇతి పూర్వకవి ప్రయోగము.

శ్లో. న యోగేన న సాంఖ్యేన కర్మణా నో న విద్యయాన్నతి
పూర్వాపార్వవచనః. టీక. ముక్తియోగేన ముక్తియో
గముచేతను. న. లేదు. సాంఖ్యేన సాంఖ్యముచేతనున
లేదు కర్మణా కర్మముచేతను న లేదు.

వ. ఆనిమత్తియును సంన్యాసయోగంబు ఆణిమాదిమహా|
మహిమలను గలుగఁజేయునట్టి దనెడివనికి డివలన నిత్యని
సంబంధ్యోగంబునందుఁ జిక్కుపడెనేని యదియును నప్పుడు
కాలానుసరణంబునం జేసి యతిదుర్లభంబగుఁగావున దాని
సాధించనలవికాక చెడుదునని యూహించుచుండెడి దుఃఖసంసా
రోత్తరణంబునకుం గల సులభోపాయంబు నుపదేశింపఁదలం
చి యిట్లనియె.

క. ధారణయోగము చేయని
వారికి మోక్షంబు ఘటన పడదని నా హృ
త్సారసమునఁ దలపోయకు
సూరిస్తుత సులభమొకటి చెప్ప వినుమా.

౧౨ మోక్షసామ్రాజ్యసాధనసులభోపాయ
ఘట్టము.

గీ. ఆశ్రమాచారకృత్యము లాచరించు
చును మనంబున నీపదభక్తిఁ దనరువారు
మరణకాలంబు డాసిన మమతగానక
హరిని మదినిల్పి బొత్తురు పరమపదము.

శ్లో. అనన్యచేతాస్సతతం యో మాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః

టీక. ఓయర్జునుఁడా యః ఎవ్వఁడు అనన్యచేతాః

బ్రహ్మేంద్రాది దేవతా విషయము గాని భక్తి మనస్సుం గలవాఁడయి
మాం నన్ను సతతం యథా వజ్రవ్రతమును నిత్యశః ప్రతిదినము
స్మరతి చింతింపుచున్నాఁడో నిత్యయుక్తస్య ఎల్లప్పుడు మనమున
హితయుక్తుఁడయిన తస్య యోగినః ఆ భక్తియోగికి అహం
పార్థ సులభః సులభముగఁ బాంధవ్యమయినవాఁడను ఇతిభగవద్వచః
అధ్యాయము ౮ శ్లోకము ౧౪.

వ. అనిన శిష్యుం డయార్యా ధారణాభ్యాసంబు వేఁగ శైబలంబు విడుచు
టయ నందది స్వార్థమరణంబనియు దాని స్మృతియను
నిరాయాసంబునం గలుగుటం జేసి యత్యుత్తమయంబు భగవద్ధ్యా
నోపయోగంబగు ననియును నిట్లు మాకెఱిఁగించినవిధంబు వినదగ్గ
బగునట్లుగాని కఫవాతపైత్త్యాది రుగ్మతలచేతఁ బాడము బహు
విధ విరుద్ధ వికార మరణ బాధలం జిక్కి యేమియుం దోపక సంచలి
తమనంబున విస్మృతి యను నజ్ఞాతమరణంబునుం గలవారికెట్లుం
తత్కాలంబునందు హరిస్మరణ సేయంగలుగునని సందియంబు
దోఁచుచున్నదనిన గురువరుండిట్లనియె.

క. అవనిని బతిమయినను నన్నుబంధబయినను
బహుళ పుణ్యమయిన పాపమయిన
మరువక యెవ్వఁడెద్ది మదిఁ దలంచును అందు
నతని కదియె తోఁచు నంత్యమందు.

ఉదాహరణము:—

శ్లోకము. యంయంవాపి స్మరన్భావం త్యజత్యంతే కళేబరం
తంతమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః

టీక. హే కౌంతేయ, ఓయి యర్జునుఁడా! యః ఎవ్వఁడు అంతే అంత కాలమునందు యంయంభావం ఏయేభావమును స్మరన్ చింతింపుచున్నవాఁడయి కళేబరం శరీరమును త్యజతి విడుచుచున్నాఁడో సః వాఁడు సదా ఎల్లప్పుడును తద్భావభావితస్సన్ ఆభావమునందను చింతనము గలవాఁడయి తంతమేవ మొదటినుంచి అనువిన్యాసమయియగు భావమునే ఏతి పొందుచున్నాఁడు ఇతి భగవద్వచః అ. ౮ శ్లో. ౬

వ. అట్లగుటంజేసి.

క. సతతము హరివయిమనసిడు
నతనికిఁదనయంతదానె యమరునుమదికి
హితవయిన్ హరిభజనము,
మృతికాలమునందు దాన మేలగు నగుచున్

లక్ష్యము. శ్లో. అంతకాలేచ మామేవ స్మరన్ముక్త్వా కళేబరం
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః

టీక. యః ఎవ్వఁడు అంతకాలే దేహాంతకాలమునందు మామేవ నన్నే స్మరన్ స్మరింపుచున్నవాఁడయి కళేబరం శరీరమును ముక్త్వా విడిచి ప్రయాతి పోవుచున్నాఁడో. సః వాఁడు మద్భావం నాస్వరూపము యాతి పొందుచున్నాఁడు అత్ర ఈయర్థమందు సంశయః సందేహంపడవలసినది నాస్తి లేదు. ఇతి భగవద్వచః అ. ౮ శ్లో. ౫.

వ. మఱియును.

గీ. ఎట్టి సాధనములు నేరనట్టి స్త్రీజాతులు
వైశ్యులును శూద్రులును నీచవర్ణజులును
హరిని సేవించి సద్గతినేగ గుచుండ
నవనిసురలును ధరాభుజులు హరినిఁ గొల్చి
పరమగతినొందుటది యంత భాగ్యమనఘ.

కారిక. శ్లో. మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేపి స్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేపి యాంతి పరాంగతిం
అధ్యాయము ౯, శ్లోకము ౩౨.

శ్లో. కింపునర్బ్రాహ్మణాః పుణ్యాః భక్తా రాజర్షయస్తథా
అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వమాం
అధ్యాయము ౯ శ్లోకము 33.

టీక. ఓ యర్జునా ఏపి ఎవరు పాపయోనయః నికృష్ట జన్మలు గలవారు స్యుః అగుదురో తేపి వారును స్త్రియః స్త్రీలును తథా అలాగుననే వైశ్యాః త్రైవర్ణికులును శూద్రాశ్చ చతుర్థులును మాం నన్ను వ్యపాశ్రిత్య ఆశ్రయించి పరాం ఉత్క్రష్టమయిన గతిం గతిని యాంతి పొందుచున్నారు గదా అ.౯. శ్లో ౩౨.

టీక. పుణ్యాః పవిత్రులయిన భక్తాః భజనసేసులయిన బ్రాహ్మణాశ్చ బ్రాహ్మణులును తథా అలాగుననే రాజర్షయః రా

జ బుషులును కాష్ఠనః ఉత్కృష్టగతిని పొందుదురని ఏమి
చెప్పవలయునా అనిత్యం క్షణభంగురమయిన అసుఖం సు
ఖవర్జితమయిన ఇమం లోకం ఈ మర్త్యలోకమును ప్రాప్య పొంది
ముక్తి కొఱకు మాం నన్ను భజస్వ సేవింపుము. ఇతి భగవద్గీ
తః అధ్యాయము ౯ శ్లోకము ౩౩.

౫౧. ధరతలంబునాశ్రమధర్మములె పరమపదసు
ఖంబునియ్యగ, జాలవ్రతముల నయసు
భక్తిచే, గాల్వకున్నను బ్రహ్మకయిన
సత్యమిది వేదవేదాంతసమ్మతంబు.

సమాధానము:-

శ్లోకము. పుంస్త్వస్త్రీత్వ విశేషో వా జాతి నామాశ్రమాదయః
న కారణం మద్భజనే భక్తిరేవ హి కారణం
యజ్ఞదాన తపోభిర్వా వేదాధ్యయన కర్మభిః
నైవ ద్రష్టుమహం శక్యో మద్భక్తివిముఖైస్సదా.

టీక. పుంస్త్వ స్త్రీత్వ విశేషో వా స్త్రీపురుషభేదమును జాతి
నామాశ్రమాదయః కులము పేరు ఆశ్రమము మొదలగునవి మద్భ
జనే నాసేవయందు కారణం హేతువు న కాదు. భక్తిరేవ నా
యందుగల భక్తి అమ్యేవే నాసేవయందు కారణం హి కారణ
మయినది అందువల్లను, మద్భక్తివిముఖైః నాభక్తిశూన్యుల
చేతను సదా యెల్లప్పుడు, యజ్ఞదాన తపోభిర్వా యజ్ఞము

దానము తపస్సు వీనిచేతను వేదాధ్యయనకర్మభిః అధ్య
యనాదికర్మలచేతను అహం నైవ ద్రష్టుం చూచుటకు శక్యు
నైవశక్యః అశక్యుఁడనుగదా. ఇత్యాధ్యాత్మరామాయణే
శ్రీరామభగవద్వచః.

క. విదురుఁడు మొదలుగు శూద్రులు
ముదమలరఁగ హరినిఁ గొలిచి మోక్షపదవికిం
బొందవఁగఁజనరే హరికృప
జాఁగ విని లోపంబుగలదె భువినెవ్వరికిన్

లక్ష్యము. శ్రీమహాభాగవతే.

శ్లో. న శూద్రాః భగవద్భక్త్యా విప్రాభాగవతాస్స్మృతాః

టీక. శూద్రాః శూద్రులు భగవద్భక్తాః భగవంతునియందు
భక్తిగలవారయినట్లైతే వారు, న.శూద్రులుగారు, కింతు
ఇఁక నేమన భాగవతాః భగవద్భక్తిగల విప్రాః బ్రాహ్మణు
లని స్మృతాః తలఁపఁబడుదురు ఇతి భగవద్వచః. మఱియు.

గీ. విష్ణుభక్తి లేని విప్రోత్తమునికంటె ~~శ్వపచుఁడె~~
శ్వపచుండె కుల వంద్యుఁ జలజనయను
పదము లెప్పుడు హృదయపంకజమున నిల్పి
గొలిచెనేని సత్యగుణము మెఱయ

కారిక. శ్రీమహాభాగవతే.

శ్లో. విప్రాద్ద్విషడ్గుణయుతాదరవింద నాభ

పాదారవింద విముఖాచ్ఛ్వపచం వరిష్ఠం

మన్యేతదర్పితమనోవచనేహితార్థ

ప్రాణం పునాతి స కులం న తు భూరిమానః.

టీక. ద్విషడ్గుణయుతాత్ సనత్సుజాతునిచేఁ జెప్పఁబడ్డ ధర్మము మొదలగు పండ్రెండుగుణములను గూడిన గడసి. అవి ధర్మశ్చ వలెనా ధర్మములును, సత్యం చ సత్యమును దమః బాహ్యేం ద్రియనిగ్రహమును త్యాగః ధనము పంచిపెట్టుటయును అమాత్స ర్యం మత్సరత్వము లేకపోవుటయును హ్రీః కర్మవిడుచుటయందు లజ్జయును తితిక్ష ఓర్పును అనసూయ పరస్త్రీయసహనమును యజ్ఞశ్చ యజ్ఞమును దానం దానమును ధృతిః ధైర్యమును శ్రుతం చ పాండిత్యమును ఈ పదిరెండు గుణములతోఁ గూడి నటువంటియు, అరవిందనాభ పాదారవింద ముఖాత్ భగవత్పాదారవింద విముఖుఁడయినటువంటియు విప్రాత్ బ్రాహ్మణుని కంటె తదర్పితమనోవచనేహితార్థప్రాణం ఆ భగవంతునియందు అర్పింపఁబడినటువంటి మనస్సును వచనమును, క్రియయును, ధనమును, ప్రాణములును గలిగి నటువంటి శ్వపచం చండాలుని వరిష్ఠం శ్రేష్ఠునిగాను మన్యే తలంతును. సః ఆ చండాలుఁడు కులం పునాతి భగవద్భక్తి వలనఁ గులమును పవిత్రముగఁ జేసికొను చున్నాఁడు భూరిమానః పూర్వోక్త ద్వాదశగుణములు గలవాఁడైన విప్రు

రాఖ్యమానమగు ఆ బ్రాహ్మణుఁడు తానయిన పవిత్రుఁడుగాఁడు.
ఇతి ప్రహ్లాదవచనః, ప్రహ్లాద వచనము భగవద్వచనమనఁబడు
నెట్లన్న శ్లో. ప్రహ్లాదశ్చాస్మి దైత్యానామితి భగవద్వచనాత్
టీక. దైత్యానాం రాక్షసులలోపల ప్రహ్లాదశ్చ ప్రహ్లాదుం
డను అస్మి అయితిని. అని భగవంతుఁడుం చెప్పుటవలనను
క. పామరులయినను నిరతము,

మామహిళాంఘ్రిసునామమాంధునిగాన వే
ధీమంతులగుచు నమృతసు
ధామంబును జారత్వం రార్య ధర్మంబెనఁగన్

లక్ష్యము. అపిచేత్సుదురాచారో భజతేమామనన్యభాక్
సాధురేవసమంతవ్య స్సమ్యగ్వ్యవసితోహిసః.
టీక॥ సుదురాచారోపి మిక్కిలి నిందితమయిన ఆచారముగల
వాఁడయినను అనన్యభాక్ నాకంటె నితరము నెఱుఁగని వాఁడయి
మాం నన్ను భజతేచేత్ సేవించుచున్నవాఁడయిననుసః వాఁడు
సాధురేవేతి సదాచారము కలవాఁడె యని మంతవ్యః తెలియఁ
దగినవాఁడు ~~కాఁడు~~ హిః, ఏ కారణమువలన సః వాఁడు. సమ్యక్
చెన్నగా, వ్యవసితః మోక్షముకొఱకు భగవంతుఁడనయి
న నాభక్తియందున్నాఁడో అందువలనను ఇతి భగవద్వచనః అట్లౌం
గీ. భక్తివైరాగ్యంబు లెట్టివంటి పామరులును
సాధ్యులనుఁజేసి చిత్తవిశ్రాంతి నొసఁగి

ముక్తానాం డింబు నిజమిది ప్రథమి నేష్ఠ ప
జడరుపాంఛ భక్తులని బుధుల్ నుడువవినవె.

ఉదాహరణము:-

శ్లో. క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి
కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి

టీక:- సః ఆ దురాచారపురుషుఁడు క్షి. ప్రా. శీఘ్రముగా ధర్మాత్మా ధర్మమందు మనస్సుంగలవాఁడు భవతి అగుచున్నాఁడు శశ్వత్ నిత్యమును శాంతిం శాంతిని నిగచ్ఛతి పొందుచున్నాఁడు హే కౌంతేయ ఓయి యర్జునుఁడా మే నా యొక్క భక్తః భక్తుఁడు న ప్రణశ్యతి నశింపఁడని ప్రతిజానీహి సభలోకి వెళ్లి ఢంకబజాయింపు మనుచున్నాఁడు నా నిత్తి ప్రతిజ్ఞఁజేయుచున్నాఁ! ఇతి భగవద్వచః అ౯ శ్లో ౩

౧౩. సర్వయోగోత్తమప్రకారఘట్టము.

వ. ఇవ్విధంబున,

గీ. నిత్యకర్మల నిరవద్యనిరుపమాన
పరమసుఖ విచ్చుటను గాదె భక్తియోగ
మఖిలయోగోత్తమంబని యనఁగఁబడెను
వేదవేదాంతసమితిచే విబుధసభల
లక్ష్యము. శ్లో. తపస్విభ్యోధికో యోగీ జ్ఞానిభ్యోపి మతోధికః
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున

టీక. యోగి భక్తియోగి తపస్విభ్యః తపస్విభ్యోఽధికః తపస్సులుగల
వారికంటె అధికః శ్రేష్ఠుఁడు జ్ఞానిభ్యోఽపి శాస్త్రార్థపాండిత్య
ముగలవారికంటె అధికః శ్రేష్ఠుఁడు కర్మిభ్యశ్చ కర్మఠులకంటె
అధికః శ్రేష్ఠుఁడని మతః అభిమతుఁడు తస్మాత్ - ఆకా
రణమువలన త్వం నీవు యోగి యోగముగలవాఁడవు
భవ ఆగుము. ఇతి భగవద్గీతోపనిషది అ౬ శ్లో ౪౬

శ్లో. యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః

టీక. యః ఎవ్వఁడు శ్రద్ధావాన్ విశ్వాసముగలవాఁడై
మాం నన్ను మద్గతేన నాయందాసక్తమయిన అంతరా
త్మనా అంతఃకరణముచేత భజతే సేవించుచున్నాఁడో
సః వాఁడు సర్వేషాం సమస్తమయిన యోగినామపి యో
గులకంటెను యుక్తతమః శ్రేష్ఠుఁడని మే నాకు, మతః
సమ్మతము. ఇతి భగవద్గీతోపనిషది అ౬ శ్లో ౪౭

. . . . . . . . . .

## ౧౪ మతాంతరజన దుర్వాద విఖండన
## ఘట్టము.

వ. అని శిష్యుం డిట్లనియె.

గీ. శ్రోతులబోధించు ననుచు మునివరు రాగ కర్తు
బలుకు చుంటివి గావున దెలుపుమీ హో ప

ప్రారంభసమయంబులంబటె వేదమంత్ర ప్రారంభకాలంబు
లందును వ్యాసాదిఋషులం బ్రార్థింపవలసియుండె నాశ్రు
తులయందట్లు చెప్పక హరిః ఓం తత్సత్ యని భగవంతుని
దలంపబడుచున్నది. ఇందువలనను విశేషించి వ్యాసభట్టా
రకుండు తాను విరచించిన భారతమందు ప్రకటించిన
భగవదాజ్ఞలలో 17 అధ్యాయము — 23 శ్లోకమునందు
భగవద్వాచకములయిన ఓం తత్ సత్ అనే శబ్దముల
చేత వేదములు మొదలగునవి పుట్టెనని చెప్పికొనెను
గాని వేదములను తాను కల్పించినట్లు చెప్పియుండలేదు.
ఇందువలనను పూర్వోక్త భగవద్గీత అ 17 శ్లో — 23 వలన
నయ్యీశ్వరముఖోద్భవంబులౌ వేదంబులనిత్యయింప
బడెను. ఇట్లు పూర్వాచార్యుండగు శంకరభగవంతుండు
సకల దుర్మతంబుల ఖండించి నిర్వ్యాజంబునొండె నా స్వ
ప్రసిద్ధగ్రంథంబు వలన సర్వంబునెఱుంగందగు దానిని
ప్పుడెంతని వివరింతుమది యట్లుండని ముక్తికతిశక్తి
త్రయుందగు నిజవల్లభుని తెలియక సంసారంబునే యుఱ్ఱ
యతికష్టంబని విడువక సుఖదుఃఖంబులకోర్చి స్వపతి
సేవయొనర్ప త్రిసత్యత్రయముసంబుద్ధ్యాధికసౌఖ్యంబు
నుంగను పతి ప్రత్యక్షంగి నా చారకరం ద ప్రబోధితకతిన
తర ప్రష్టాచార్యధర్మయన ఏకవారాశన జాగరణాహార నియమాదిసంగ్రహ

నుష్ఠానంబులొనరించుటకయి బోధమిన బ్రాహ్మణ క్షత్రియులు తమ
తమ మతంబులకుంగల సదాచారంబులు శరీరాయాసకరంబులు
యున నతికష్టతరంబనక నాచరించి యిహంబునందు
యశంబును పరంబునందు సౌఖ్యంబునుంగాంచుట యుచితం
బగుంగావున నీవు దుష్కృత దుర్వాదంబుల త్రోవంబోక నకతోలి
మనుజుల భగవదాజ్ఞలని తదర్థంబు శిరంబునందిడికొని విధి
వర్తనుండవయి భక్తిజ్ఞాన వైరాగ్యంబుల సంపాదించుకొని
ముక్తుండవగుమని బోధించిన భాష్యయందును దేవతాంశో
ద్భవుండును నిర్మలచిత్తుండును హిందూమతోద్భవుండును
గావున శిష్యుండు వేదనిందకుండినక స్వధర్మానుష్ఠానంబే
నిఖిలజనంబులకు శుభకరంబగునని నిశ్చయించి వెండియు
భగవద్భక్తి ప్రచారంబుసేయంగం దలంచి గురుమణిని వలోకించి
యుట్లనియె.

స్వధర్మానుష్ఠానమే శ్రేష్ఠమనుటకు లక్ష్యము.

శ్లో. "స్వకర్మనిరతస్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు"

టీ. స్వకర్మనిరతః స్వకీయకర్మమందాసక్తుండయినవాడు
యథా: ఏ ప్రకారముగా సిద్ధిం సిద్ధిని విందతి పొందుచున్నాడో
తత్ ఆకర్మవిధానమును శ్రుణు వినుము. అ.గీ. శ్లో ౪౬.

శ్లో. యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదంతతం
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః

టీక. యతః యః ఈశ్వరుని వలన భూతానాం ప్రాణుల
యొక్క ప్రవృత్తిః ఉత్పత్తి భవతి అగుచున్నదో యేన
ఏయీశ్వరుని చేత ఇదం సర్వం ఈ సమస్తమయిన జగత్తు
ను, తతం వ్యాపింపఁబడెనో తం మానవః మనుష్యుఁడు స్వకర్మ
ణాం తన తన వర్ణాశ్రమోచిత కర్మములచేత తం ఆ యీశ్వరు
ని అభ్యర్చ్య పూజించి సిద్ధిం మోక్షమును విందతి పొందు
చున్నాఁడు అ. ౧౮ శ్లో. ౪౬.

శ్లో. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్,,
టీక. విగుణః తక్కుతరాచార గుణములతోగూడిన దయినను స్వధ
ర్మః స్వకుల ధర్మము స్వనుష్ఠితాత్ సుఖముగా నాచరింపఁ
బడిన పరధర్మాత్ ఇతర ధర్మమునకంటె శ్రేయాన్ శ్రేష్ఠము
యినది ఇతి భగవద్వచః. అ. ౧౮ శ్లో. ౪౭

గీ. భక్తి యొక్క స్వరూపంబు భక్తి సార
సంగ్రహంబును భక్తుని చర్య వెల్ల
నరసి బోధింపఁగదవయ్య నతులధైర్య
సంతతానంద గుణ ధుర్య సాధువర్య

వ. అనిన సద్గురువరుం డిట్లనియె.

౧౫. భక్తి స్వరూప విచారణ ఘట్టము.

ఉ. శ్రీవరమోక్షసుధాకరము చిత్తవిశుద్ధికరంబు సర్వలో
కోత్తరమోక్ష సంభావకరము శోభితమయూఖ పటీరచంద్రికా

సాధకుని సంతతం తతి ఆతనవ్యయ శోభనకంబు మోక్షిల ప్రాప్త్యంతర సమయంబులబు ధులారత్వ, దలంతురు భక్తి యోగమున

వ. శాస్త్రన, దద్విధంబు వినుమెట్టి విద్వాంసునకయిన మాయా గుణభ్రాంతి దాలంకగా నిముక్తి పదంబునొందబడదు “మమ మాయా దురత్యయా” యను భగవద్వచనప్రమాణంబు గంజేసి మాయ తరింపనలవిగానిదనియు దానినతిక్రమింపకగాని మోక్షస్థానంబు సిద్ధింపదనియు నివ్విధంబున నె స్వశక్తిని సాధింపుట కశక్యంబయిన మోక్షశ్రీ వేఁబని యేమనియు విడువందగదు.

« మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే »

అనగ ~~[crossed out]~~ ఎవరు మాం నన్ను ప్రపద్యంతే పూజింపుచున్నారొ తే వారు ఏతాం మాయాం ~~ఈ~~ మాయను తరంతి దాటుచున్నారు. అను భగవద్గీతోపనిషద్ ప్రమాణంబునం జేసి భగవద్భక్తివలన మాయ దాటంగునని తెలియందగు నట్టి భక్తిస్వరూపం బెట్టిదంటిరేని నిశ్చలభక్తియిందవయి యాకర్ణింపుము

గీ. స్వస్వరూపానుసంధాన సత్వవృత్తి
భక్తియనఁబడు వినుమది యుక్తిమెఱయ
నవవిధంబులనొప్పారు భవవిముక్తి
సాధనములందు నిది గొప్పసాధనంబు

వ. ప్రమాణవచనము.

శ్లోకము. మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసి
స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే

టీక. మోక్ష మోక్షము యొక్క సాధన సామగ్ర్యాం సాధనోపకరణములలో భక్తిరేవ భక్తియనునదియే గరీయసి శ్రేష్ఠమయినది భక్తియనగా
స్వస్వరూపానుసంధానం స్వ పరమాత్మ యొక్క స్వరూప స్వరూపము (రామకృష్ణాద్యవతారములు,వారి) యొక్క అనుసంధానం విచారణయును, విశేషించి బ్రహ్మాత్మైక చింతనమును భగవద్గీతలలో.... అధ్యాయమందు ...శ్లోకముచేత పరమాత్మకు తాను స్వరూపమని శ్రీకృష్ణమూర్తి చెప్పుకొనెను. భక్తిః భక్తియని అభిధీయతే చెప్పబడుచున్నది ఇతి వివేకచూడామణ్యాం శంకరభగవద్వచః. ఇందు విచారణయనగా నెట్టిదనిన

శ్లో. భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరం

టీక. అహం నేను యావాన్ ఎంతవాడనయినను యశ్చ ఎటువంటివాడను అస్మి అయియున్నానో మాం అట్టి నన్ను భక్త్యా భక్తిచేత తత్త్వతః యదార్థముగా జ్ఞాత్వా ఎఱింగి తదనంతరం ఆ పిమ్మట విశతే నన్నే (ప్రవేశింపు)చున్నాడు ఇతి భగవద్వచః అ౧౮ శ్లో ౫౫.

వ. అని తెలిపి భక్తి నెరా ~~[illegible]~~ గాంగంబు వివరింపం ద
లంబు వెండియు నిట్లనియె.

సీ. హరి దివ్యమంత్ర మంత్రార్థముల్ దేశిక
స్వామిచే శ్రవణపర్వముగ వినుట
తాళనృత్య సుగాన తతిమీరఁగ హరికథల్
మనసొప్పఁ బాడుట మధువిరోధి
చరణ సారసముల నిరతంబుఁ గొలుచుట
స్మరగురు నామ సంస్మరణఁ జేయు
చుండుట దేవదేవుని విగ్రహార్చనల్
సలుపుట వందనములనొనర్చు
ట మహాత్ముని దాస్యవర్తనమందియుట
పుండరీకాంబకుని మైత్రి పొలుపుగనుట
తనను శ్రీవిభుకర్పించుకొనుట యుర్వి
భక్తికంగంబులందురు బ్రహ్మవిదులు.

తాత్పర్యము.

శ్లో. శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనం
ఇతిపుంసార్పితా విష్ణౌ ర్భక్తిశ్చే న్నవలక్షణా

౧. సద్గురువువలన మంత్రమంత్రార్థములు వినుట
—౨. గీతనృత్య వాద్యానుకూలముగా భగవద్దివ్యగుణా

ను శ్రవణము చేయుచుండిన అంతరంగా వ్యపదులు మొదలయి

౨ కీర్తనలను మదికి సంతోషము పుట్టునట్లు పాడుట

౩ భగవంతుని స్మరించుచుండుట

౪ భగవత్పాదారవిందములను సేవించుట

౫ భగవద్విగ్రహం పూజ సేయుట

౬ భగవంతునికి నమస్కరించుచుండుట

౭ భగవంతునికి దాసుడగుట

౮ సకలకాలములయందు భగవంతుడే తోడునీడయనుకొనుట.

౯. భగవదాంశ అయిన ఆత్మను భగవంతుని సొమ్ముగా నర్పించుకొనుట

ఈ తొమ్మిదియు భక్తికి నవయవములు మఱియు

౧౬. భక్తిసార సంగ్రహ ఘట్టము.

౧. భక్తిసారాంశమయ ప్రపత్తియదియు

ఘోర సంసార దుఃఖ విదారశక్తి

సంగష ఊర్ధ్వ స్వాంతంబునయి యలరుచుండు

దానినే ఆచరింతు విసంవాదము లేక చెప్పెద.

౨. ఆత్మనాకరుణతో రక్షింపుమంటి చరా

చరముల నేను రాంక్షి మరవకుండు

రక్షించుమని రమారమణుని వేడుట

కంసారికిష్టసంకల్పుఁడగుట
చక్రికిం బొందవనిచర్యాలంటవయుండె
గతి వేఱొకటి నాకంటె నన్ననుట
నా యంశమగుట నే నా సొమ్ము అని తన
నచ్యుతార్పణం జేసి యలరుటయును
నారదుఁ గూడ ప్రవృత్తియం బనగనలరు
భాగవతసేవ్యపానమయి పద్యసంభ
వాదిసురవెన్న సంసరణాబ్ధి దాటు
మార్గములలో నని దిశుభమార్గ మగుచు.

లక్షణము.

శ్లో॥ ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనం
రక్షిష్యతీతి విశ్వాసః గోప్తృత్వవరణం తథా
ఆత్మనిక్షేపకార్పణ్యే షడ్విధా శరణాగతిః

౧. భగవంతుఁడు రక్షింపఁగలఁడనునమ్మకమనఁగా

శ్లో. రక్షతి లక్ష్మీనాథ స్సంతతమేతచ్చరాచరం విశ్వం

టీక. చరాచరం, స్థావరజంగమాత్మకమయిన ఏతత్ ఈ విశ్వం ప్రపంచమునను లక్ష్మీనాథః శ్రీమన్నారాయణమూర్తి రక్షతి రక్షించుచున్నాడు అని ఈ పండితవచనరీత్యా సర్వరక్షకుఁడు శ్రీమన్నారాయణపరమేశ్వరుఁడగుట ~~వలన~~ అయ్యన తన్ను రక్షింపఁగలఁడని నమ్ముట.

౨ రక్షించుమని కోరి వరించుట నగా

శ్లో. హరిః కృష్ణ ద్వారకావాస క్వాసి యాదవనందన
ఇమామవస్థాం సంప్రాప్తం రక్ష మాం శరణాగతం.

టీక. ద్వారకావాస. ద్వారకాపురమందు నివసించియున్న హరి కృష్ణ ఓ శ్రీకృష్ణస్వామి త్వం నీవు క్వ ఎచ్చట అసి ఉన్నావు. ఇమాం ఈ అవస్థాం ఆపదను ప్రాప్తం పొందినటువంటియు శరణాగతం రక్షించుమని కోరుచున్న మాం నన్ను రక్ష రక్షించుము అనెడు ద్రౌపతీ భంగి శరణాగతుండౌట.

3 భగవదిష్టానువర్తనమనఁగా

శ్లో. మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ఇత్యాది భగవద్వచనములననుసరించి వర్తించుట.

౪ భగవదనుకూలవర్తనమనఁగా:-

శ్లో. అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః

యః ఎవఁడు అనన్యచేతాః ఇతరులయందు మనస్సునుం చనివాఁడయి మాం నన్ను నిత్యశః ప్రతిదినమందును సతతం నిరంతరమును స్మరతి స్మరించుచున్నాఁడో అను భగవద్వచనరీత్యా దేవతాంతరుఁడు గాకుండుట అనఁగా సర్వదేవమయుఁడు (శ్రీ) మహావిష్ణువే యని తలఁచుట.

౫. దిక్కులేనివాఁడని దైన్యము చెప్పికొనుట అనఁగా

శ్లో. మాతా రామో మత్పితా రామచంద్రః

స్వామీ రామో మత్సఖా రాఘవేశః
సర్వస్వం మే రామచంద్రో దయాళుః
న్నాన్యం జానే నైవ జానే న జానే

టీక. రామః. రామమూర్తి మే నాకు మాతా: తల్లి. రామచంద్రః: (శ్రీ)రామమూర్తి మత్పితా: నాతండ్రి (శ్రీ) రామః (శ్రీ) రామమూర్తి స్వామి (ప్రభువు) రాఘవేశః (శ్రీ)రామమూర్తి మత్సఖా: నాకు స్నేహితుడు దయాళుః దయాశీలుడైయున రామచంద్రః శ్రీరామమూర్తి మే: నాకు. సర్వస్వం సర్వమును అన్యం నేను అన్యం: మఱియొకరిని న జానే గుర్తెఱుంగను. నైవ జానే: గుర్తెఱుగను, న జానే గుర్తెఱుంగను అనునవి గస్వ్యాదులచే నిరాకరించబడెను.

౬. తనన్ను సమర్పించు కొనడమనఁగా.

శ్లో. మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః

టీక. జీవలోకే ప్రపంచమునందు మమైవ. నాదయిన అంశః అంశము సనాతనః అనాదియయిన జీవభూతః జీవసముదాయము జీవులు అనాదియనునందుము:-

శ్లో. జీవ యీశో విశుద్ధాచితే తథా జీవేశయోర్భిదా
అవిద్యా తచ్చితోర్యోగ షడస్మాక ~~[illegible]~~ మనాదయః

టీ.॥ జీవః జీవుడును ఈశః ఈశ్వరుడును తథా అట్లే జీవే

శయోః జీవేశ్వరులకు భిదాభేదమును అవిద్యాప్రకృతియు తచ్చితోః ఆ ప్రకృతి చైతన్యములకు యోగః సంబంధమును షట్ ఈయారును అస్మాకం అద్వైతమందు అనాదయః అనాదులుగాఁజెప్పఁబడెను. అనగా భగవద్వచనరీత్యా జీవుఁడగు తన్ను భగవదంశగానెఱింగి అంశి అంశిలో సమర్పించుకొనుట ఇవి ఆ ఆను ప్రపత్తికవయవములు.

వ. ఇట్లు భక్తిప్రపత్తులవిధంబెఱింగించి భక్తుని చర్యలుపదేశింపందలంచి వెండియు నిట్లనియె,

౧౨ భక్తజన చర్యావిధాన ఘట్టము.

సీ. ఆశ్రమోచితకర్మలాచరించుట భాగ
వతులసేవించుట పరమమైత్రి
పురుషోత్తముని పాదములను బూజించుట
మురవైరి చారిత్రములను వినుట
హరినామకీర్తనలను వాంఛఁజేయుట
పరమార్థ సద్భావపదవి గనుట
భగవజ్జయంతోత్సవములను జరుపుట
యేకాదశీవ్రతమెలమిగానుట
పుంభి నిధవ నెమ్మదిగాయుచుటయును
చర్యలనంబడు నీరీతి సత్త్వవృత్తి
నడుచువారెల్ల ముక్తికి నడుచుచుండ్రె

విమల విజ్ఞాన వైరాగ్య విభవ మెసఁగ.

లక్ష్యము.

శ్రీరామః. శ్లో. మద్భక్తేః కారణం కించిద్వక్ష్యామి శృణు తత్వతః
మద్భక్తి సంగస్సతతం మత్సేవా చ నిరంతరం.
ఏకాదశ్యుపవాసాది మమ పర్వానుమోదనం
మత్కథా శ్రవణే పాఠే వ్యాఖ్యానే సర్వదా రతిః
మదర్చాపూజాపరినిష్ఠా చ మమనామానుకీర్తనం
ఏవం సతతయుక్తానాం భక్తిరవ్యభిచారిణీ
మయిసంజాయతే నిత్యం తతః కిమవశిష్యతే
అతో మద్భక్తియుక్తస్య జ్ఞానం విజ్ఞానమేవ చ
వైరాగ్యం చ భవేచ్ఛీఘ్రం తతో ముక్తిమవాప్నుయాత్

టీక. శ్రీరామః శ్రీరామమూర్తి లక్ష్మణస్వామికి ఉపదేశించుచున్నారు. కించిత్- సూక్ష్మముగాను తత్వతః యదార్థముగాను మద్భక్తేః నాభక్తికి కారణం ముఖ్యకారణమును వక్ష్యామి చెప్పఁగలను శృణు విసుము. సతతం ఎల్లప్పుడును మత్సేవా చ నాసేవయు ఏకాదశ్యుపవాసాది ఏకాదశియందు ఉపవాస జాగరణ భజనాదులును మమ నాయొక్క పర్వపర్వములు అనఁగా శ్రీరామనవమి ప్రభృతి దశ-జయంతులయందు అనుమోదనం ఉత్సవమును మత్కథా శ్రవణే నాకథలు వినడమందును పాఠే శ్రీమద్రామాయణ భాగవతాది గ్రంథము లు

పఠించదమందును వ్యాఖ్యానే అర్థప్రకటనమందును సర్వదా
రతిః నిరంతరాసక్తియు మత్పూజాపరినిష్ఠా చ నా పూజయాం
దుశ్రద్ధయు మమ నామానుకీర్తనం నా నామానుకీర్తనము
ఏవం ఈ ప్రకారముగా సతతయుక్తానాం ఎల్లప్పుడుకూడు కొనిన
వారికి అవ్యభిచారిణీ చెదని భక్తిః భక్తి నిత్యం ఎల్లప్పుడున్న
మయి నాయందు సంజాయతే ఏర్పడగలుగుచున్నది
తతః ఇంతకంటె కిం ఏమి అవశిష్యతే మిగిలియున్నది. అతః
ఈ హేతువువలనను మద్భక్తియుక్తస్య నా భక్తిగలవారికి
జ్ఞానం జ్ఞానమును విజ్ఞానం అనుభవమును వైరాగ్యం చ
వైరాగ్యమును శీఘ్రం త్వరితముగా భవేత్ కలుగును
తతః అందువలన ముక్తిం ముక్తిని అవాప్నుయాత్ పొం
దుదురు ఇత్యధ్యాత్మరామాయణే శ్రీరామభగవద్వచః

వ. ఇట్లు భక్తిప్రపత్తి చర్యాలయందు చెప్పంబడిన విధా
నంబులలో కరచరణాద్యవయవంబులచే చేయంబడు
నతిత్యాగ తత్పూజావందనాదికంబులు బాహ్యభక్తియనంబడు
అంతఃకరణముచేత చేయంబడు ధ్యానాదికంబంతరంగ భక్తియను
నంజెల్లు ఇతరగతి లేనివాడయి మనోవాక్కాయకర్మంబు
లచే భగవంతుండే రక్షకుండని నమ్మి గొలుచుచుండుటది
యనన్య భక్తియన నొప్పునిందు నంతరంగ భక్తియె యేకాంత
భక్తియనగు ననిన విని శేషుండిట్లనియె.

గీ. భక్తియోగంబుచే నాల్గు ముక్తులవరు
సంచు మున్నె బోధించితి వరయ ముక్తి
యొక్కటియె యుండవలెగాని పెక్కులగుట
కేమికారణమయ్య నాకెఱుఁగఁ బలుకుము.

వ. అనిన సద్గురువరుం డిట్లనియె.

గీ. ఏకవిధమయ్యు నపవర్గమెల్ల విభిన్న
రూపముగఁ దోఁచుచుండు సరోజనయన
గాలుచు దారుఢ్య సంపదఁ జూపవగానఁ జేసి
యనిన నది తెల్పుమని గురుం డనియె నిట్లు

ఉదాహరణము:-

శ్లో. ఏకరూపా ముక్తి రధికారతారతమ్యేన భిన్నవత్ప్రతి
భాతి (ముక్తికోపనిషది). ముక్తి ఏకవిధమయ్యును ఉ
పాసనబల తారతమ్యంబువలన వేఱువేఱుగాఁ దోఁచుం
బడును.

౧౪. చతుర్విధ ముక్తి విచారణా ఘట్టము.

గీ. బాహ్యభక్తి హృదయపంకజమున రూఢి
దనర నెవఁడు హరినిఁ దగిలి గొలుచు
నతఁడు మోక్షప్రదము సాలోక్యమౌ నిత్య
సుఖము నొందుచుండు శుభగవేల
(ముక్తికోపనిషద్వ్యాఖ్యానమందు శ్రీరామమూర్తి హనుమం

తునకుపదేశించుచున్నాఁడు.

“ఉపాసనా మహిమ్నా ఉపాసకేభ్యో మదభిన్న బ్రహ్మలోకం

గత్వా ~~నాకు వేరుగాని బ్రహ్మలోకమునందుండి~~ సర్వంభో

గానేకప్రదేశే భుంక్త్వా తిష్ఠంతి.” తత్సాలోక్యముక్తిః మద

భిన్నబ్రహ్మలోకం గత్వా: నాకు వేరుగాని బ్రహ్మలోకమునుపొం

ది సర్వభోగాన్ సమస్త భోగములను ఏకప్రదేశే ఒకచోట

భుంక్త్వా అనుభవించి తిష్ఠంతి ఉన్నారు. తత్ అది సంభా

సనుభవముతో గూడిన సాలోక్యముక్తిః సాలోక్యము

క్తియనంబడును. ఇతి ముక్తికోపనిషది.

౫. అంతరంగభక్తి నపరమై కొనువాఁడు

హరిసమీపమందు నమితసుఖము

జెందుచుండు మరలఁ జేరఁ డిట్టి క్షితికిఁ

గల్పకోట్లైన ఘనులు మెచ్చ

వే ఉదాహరణము.

శ్రు. మద్రూపం సగుణాకారేణ సంభావ్య

శ్రుతిస్మృతీతిహాసపురాణోక్త నిత్యతదనుగుణా

ర్చతయా ఆలోచ్యతే బ్రహ్మలోకంగత్వా

టీ. ఏ ఎవరయితే మద్రూపం నా స్వరూపమును సగు

ణాకారేణ సగుణాకారముచేత సంభావ్య ఊహించి

శ్రుతిస్మృతీతిహాసపురాణాని శ్రుతులు స్మృతులు ఇతి

హాసములు పురాణములు వ్రాసిరి తదనుగుణోపాయం

~~అనుకూలముగాను~~ తత్ ~~అ~~ సగుణాకారమునకు

అనుగుణోపాయం అనంతరాలముగాను ఆలోచ్య

ఆలోచించి బ్రహ్మలోకం గత్వా: పరబ్రహ్మలోకమును

పొందగలవారు. మరియు.

శ్రు. మత్సమీపే తిష్ఠంతి హైవ సామీప్య ముక్తిః

టీక. మత్సమీపే తిష్ఠంతి: భగవంతుడనయిన నాస

మీపమునందున్నార్లో హైవ అదే ~~ఘ~~ సామీప్యము

క్తిః సామీప్యముక్తియగును ఇతిముక్తికోపనిషది

గీ. విను మనస్య భక్తి విదుపతి చేసిన

వాఁడు వేదుతలరి వనజనాభు

సమలరూపమంది యానంద జలని ధి

నోలలాడుచుండు నొందల కెప్పుడు

లక్ష్యము.

శ్రు॥ ఏ సగుణోపాసకా మదర్చనపరాః సామాన్య

జ్ఞానవంతః కల్పితమల్లోకం, మత్సమీపం, మదా

రాధనం ప్రాప్య మోదంతే నిష్కళ్మషా ఇతి శ్రుతిః

బ్రహ్మణోమమా ద్వ్యస్తం యద్రూపం తద్రూపం ప్రాప్య

త్రస్థిత భోగాన్ భుక్త్వా తిష్ఠంతి హైవ సారూప్యముక్తిః

టీ. ఎవరయితే సగుణోపాసకాః సగుణోపాసకులయి మద

ర్చనపరాః సామీప్యం ప్రాప్తాః భక్తులయి సామీప్య జ్ఞానవం
తః సామీప్య జ్ఞానముగల వారయి కల్పితముల్లోకం కల్పిం
చుకొని బద్ధ సాలోకమునందు అనగా అవిద్యా పాదమం
దనుట మత్సమీపం సామీపమందు అనగా ప్రతి
ష్ఠాది పూజా విగ్రహ సమీపమందనుట మదారాధనం నా
పూజనం ప్రాప్య పొంది అనగా చేసి మోదంతే, సంతో
షించుచుందుర్నారో నిష్కళమితి ప్రకృతినంటని బ్రహ్మణో
మమ బ్రహ్మస్వరూపుడనయిన నాయొక్క అర్థస్త్రం
అద్వ్యసచేచ్ఛాందదదగిన యదృచ్ఛారూపం పరూపముగలదో
తి రూపం-ఆరూపమును ప్రాప్య పొంది తత్రస్థితశ్చో
గాన్ అశ్నుతే అనగా మోక్షస్థానమునందు గలభోగము
లనుభుంక్త్వా అనుభవించి తిష్ఠంతి ఉన్నారు సైవ అనే
సారూప్యముక్తి యనబడును. ఇతి ముక్తికోపనిషది

గీ. అవనిబాహ్యాది భక్తిత్రయంబునొంది
హరి నిహరి భక్తులనుమందుబలరగావిచి
పరమ వైరాగ్య సంపదం బరగువాని
విష్ణుసాయుజ్యమనె లక్ష్మి విడువదెప్పుడు

లక్షణము:-
శ్రు. ఉప, మత్సగుణాధ్యాననిరతాస్తే భ్రమరకీటవ
త్ ధ్యానబలాత్ సాయుజ్యం ~~సాయుజ్యముక్తిసా~~

~~ప్రాప్నువంతి: పొందుదురు~~ ప్రాప్నువంతి నైవ సాయుజ్యముక్తిః
టీక. ఏ ఎవరు మత్సగుణధ్యానే నిరతాః = నాసగుణోపా
సనయందు నిరతాః నిశ్చలులైరి తేః వారు భ్రమరకీట
వత్ భ్రమరకీటన్యాయము చేత ధ్యానబలాత్ ధ్యాన
శేషము వలన సాయుజ్యం సాయుజ్య<u>ముక్తి</u>ని ప్రా
ప్నువంతి = పొందుచున్నారు. నైవ అదే సాయుజ్య
<u>ముక్తి</u>ః : సాయుజ్యముక్తియనబడును.

ఇతి <u>ముక్తి</u>కోపనిషది

"సయుజోర్భావః సాయుజ్యమితి."

సయుజోః = జీవేశ్వరులయిద్దఱిరెంటొక్క భావః కలుగు
చున్న ధర్మము సాయుజ్యం సాయుజ్యమనబడును
అనగా జీవుడు భగవదానందము తోడ సాటియ
గు సంతోషమును బొందుటయనుట.

౧౮. ఈ చతుర్విధ<u>ముక్తి</u>కారణంబగు
నారాయణనామ వైభవ విచారము.

వ. ఇవ్విధంబున

క. నారాయణ యను నామము
భూరిసుఖంబిచ్చు చుండు భువి మానవులా
నారాయణుని దలంపరె
ఘోరంబగు నరకములను గాంచుదురహహా!

లక్ష్యము:-

శ్లో॥ నారాయణేతి నామోస్తి వాగస్తి వశవర్తినీ
తథాపి నరకే ఘోరే పతంతీత్యేతదద్భుతం

టీక॥ నారాయణేతి : నారాయణా యనెడి నామము వాక్యము అస్తి: కలదు. వశవర్తినీ : స్వాధీనమయి యుండెడి వాక్: వాక్కు అస్తి కలదు తథాపి అయినను పామరులు ~~ఆ~~ నామమును స్మరింపక ఘోర భయంకరమయిన యెంటి నరకే నరకమందు పతంతి పడుచున్నారు. ఇతి ~~నారద (శ్రీ) మహర్షి వచః~~ ఏతత్ ఇట్లగుట ఇది అద్భుతం ఆశ్చర్యము ఇతి నారద (శ్రీ) మహర్షి వచః ,

వ. అని శిష్యుండగ్గురు వరునవలోకించి ముకుళిత కరతలముండయి [illegible] ట్లనియె.

గీ. దేశికేంద్ర (శ్రీ) కరుణా దాపింప నారాయ
ణాంఘ్రి శబ్దమునకును మరియు న్న
సారసంగ్రహార్థ మారసి తెలుపవే
సూరిజనులు మెచ్చ శుభము హెచ్చ.

వ. అనిన నయ్యాచార్యుం డిట్లనియె.

గీ. అచ్యుతుండు విష్ణుండాది నారాయణుం
డవ్యయాత్మ పూర్ణుం డమలు డాద్యుం
డక్షి విభుని నామమందా ప్పునారంశ

మరిని తెలుప బ్రహ్మకయినవశమే ?

గీ. అయినఁ జెప్పెద మద్గురుఁడానతిచ్చి
యున్నవిధమైన శాస్త్రక్రమం బున్నసరణి
విన్నగన్నట్టి మదిఙ్ఞను తెన్నునట్లు
శ్రుతులకుం బొంపువిసమయ్యె శుభమెసంగ

గీ. దాసఁగ బ్రహ్మంబు ఖరాతముల్ భూరాతసంఘ
మందునుండుట యర్థమయి యలరునివ్వి
ధంబుగా నరనారాయనంబులకును
నవిమెశాస్త్రోక్తి నారాయణాఖ్యనొందె.

ఇందుకు సమాధానము.

వ. నరపదనారపద అయిన పదంబులు మూఁడునుంగూడి నారాయణా శబ్దంబయ్యె నెట్లనిన నరతీతి నరః ఇట్లు నరతియను ధాతువు వలన "నరః" యనుపదంబయ్యె నానరపదంబునకు వ్యాపకశీలుండగు పరబ్రహ్మంబర్థంబని చెప్పంబడు నిందుకుతుల శ్లోకము.

శ్లో. నరతీతి నరః ప్రోక్తః పరమాత్మా సనాతనః

టీక. సనాతనః నిత్యుఁడయిన పరమాత్మా పరబ్రహ్మము నరతీతి వ్యాపించువాఁడుగనుక నరః నరుఁడనంబడెను, "నరాత్ జాతాని నారాణి" యను వ్యుత్పత్తివలన

టీక. నరాత్ పరమాత్మవలన జాతాని ఆకాశాదీని

ఆకాశాదిభూతములు పుట్టినవనుటచే నారాణియను
పదంబయ్యెఁ గాఁబట్టి నరపదంబునకు పరమాత్మ అర్థం
బగు నారపదంబునకు అపరమాత్మప యైన
ఆకాశాదిభూతపంచకం బర్థంబగు అట్లగుటచే నా
రాణి ప్రాగుక్తాకాశా భూతములు అయనం
స్థానము యస్య ఏవనితో సః వాఁడు నారాయణః
నారాయణుఁడనఁబడును.

ఇందులకు లక్ష్యము.

శ్లో. బ్రహ్మాదీని స్తంబాంతాని చరాణి స్థావరాణిచ
అయనం తత్పరా విష్ణోస్తేన నారాయణస్మృతః

టీక. బ్రహ్మాదీని బ్రహ్మము మొదలగు చరాణి చరము
లును స్థావరాణిచ స్థావరములును అయన భూతాని
భూతములు అస్య విష్ణోః ఈ శ్రీమహావిష్ణువునకు
అయనం స్థానము తేన ఆ హేతువుచేతను నారా
యణః నారాయణుఁడని స్మృతః చెప్పఁబడుచున్నాఁడు
ఇతిస్మృతిః ॥ దృశ్యతే శ్రూయతేఽపి వా, అంతర్బహిశ్చతత్సర్వం

శ్రు. యచ్చ కించిజ్జగత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః ఇతి

టీక. కించ ఇంచుకంతయయిన సర్వం సమస్తమున
యిన యత్ ఏ. జగత్ జగత్తు దృశ్యతే చూడఁబడు
చున్నదో శ్రూయతేఽపి వా వినఁబడుచున్నదో తత్

తత్సర్వం ఆ సర్వప్రపంచమును అంతః లోపల
బహిశ్చ వెలుపల వ్యాప్య వ్యాపించుకొని నారాయ
ణః శ్రీమన్నారాయణ మూర్తి స్థితః ఉండెను. ఇత్యు
పనిషది. ఇది [illegible] అర్థము.

91. వినుము జగత్కారణ [illegible] సరుహంబు
దలఁప నెవ్వని పొక్కిలి కొలనులోన
బొడమె నంతటఁ బో నారాయణుఁడు నిజంబు
సమ్మిళియని [illegible] శాస్త్రములు విమ్ము [illegible]

ఇందుకు సమాధానము.

నారస్య అయనః నారాయణః ఇత్యుత్పత్తి
టీక నారస్య జగత్కారణమయిన సరోరుహము
నకు ఆయనం స్థాన [illegible] భూతుఁడగుట నారాయణః
నారాయణః నారాయణుఁడనఁబడెను.

లక్ష్యము.

శ్లో. నారం సరోరుహం ప్రోక్తం జగద్యోనియతం పురా
యస్యనాభౌ సముత్పన్నం స నారాయణ ఉచ్యతే.

టీక. జగద్యోనియతం జగత్కారణమయిన సరో
రుహం కమలము నారం నారమని ప్రోక్తం చెప్పఁబ
డినది. తత్ ఆ కమలము యస్య ఎవని యొక్క
నాభౌ నాభియందు సముత్పన్నం పుట్టినదో సః

వాఁడు నారాయణః నారాయణుఁడని ఉచ్యతే
చెప్పఁబడుచున్నాఁడు ఇతి స్మృతిః. ఇది పై[illegible]ర్థము.

గీ. భువనములకన్న ముందుగా భువనములను
కరము గల్పించి బ్రహ్మాండకటాహములను
నిల్పి దాని పైనెవ్వఁడా నీటియందు
నతఁడె వాచ్య[illegible] నారాయణాఖ్యమునకు

ఇందుకు సమాధానము:-

నారాః అయనం [illegible]స్య సః నారా[illegible]ణః ఇతి
వ్యుత్పత్తిః టీక. నారాః ఉదకము[illegible] అయనం
స్థానము యస్య ఎవనికో సః వాఁడు నారాయణః
నా[illegible]యణుఁడనఁబడెను.

లక్ష్యము.

శ్లో. ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః
తా యదస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః
ఇతి మనుస్మృతిః। టీక ఆపః ఉద[illegible]ములు నరసూన
వః నరః నరులకు సూనవః కారణములు తాః
ఆః ఉదకములు అస్య ఆ శ్రీమహావిష్ణువునకు
అయనం: స్థానము తేన ఆ హేతువు చేత
నారాయణః నారాయణుఁడు. స్మృతం చెప్పఁబ
డుచున్నాడు మఱియును.

శ్లో. అప ఏవ ససర్జాదౌ తాసు వీర్యమపాసృజత్
తదండమభవద్హైమం సహస్రాంశు సమప్రభం

టీక. ఆదౌ బ్రహ్మాండమున[illegible] సృష్ట్యాదియందు అప ఏవ ఉదకములనే ససర్జ సృజించెను తాసు-ఆ ఉదకములయందు వీర్యం వీర్యమును అపాంస జత్ ఉంచెను. తత్ ఆవీర్యము హైమం సువ ర్ణమ[illegible]తమయినటువంటిదియు సహస్రాంశు సమప్రభం సూర్యునిభంగి నొప్ప[illegible]శించుచున్న అండం బ్ర హ్మాండము అభవత్ ఆయెను.-ఆ బ్రహ్మాండము ఉదకాంధకారముగా నిలిచియుండెననుట. అట్లుని లుచుటచే ఆ బ్రహ్మాండమునకుం బెమ్మ[illegible] ఉదక సృష్టి చేయంబడియె. ఇతి మనుస్మృతిః.

క. నారాయణ శబ్దార్థం
బారతిని నేకవిధముం దేర్పడ సభలన్
సూరిజనంబులు విద్యా
పారా[illegible]తశక్తినెప్పుడు సం[illegible]తురు నరనాథ

వ. అనిన శిష్యుం డిట్లనియె.

గీ. తనరు నారాయణాఖ్య శబ్దార్థబోధ
గలుగఁ జేసితివింక సత్కారుణావిచార
భగవదస్మిత్కీర్తనము త్రొభవ్య దివ్య

పరమతత్త్వంబు తెల్పవే గురువరేణ్య!

వ. అనిన నద్దేశికేంద్రుం డిట్లనియె.

గీ. స్రష్టారుద్రేంద్రసురనరప్రతతికెల్ల
ఘోరసంసారవిషరాశి శోషకరంబు
భూరిమంగళమంగళములకు నెలవు
సచ్చిన్నారాయణాష్టాక్షరి మ్ముమెఱుఁగు.

గీ. ఆమహామంత్రము మంత్రార్థ మరసి నిజము
బలుకశక్యంబె వేనోళ్ళ బలుకవేయిన
నయినఁ దెల్పద శ్రుతిసహాయమునఁ జేసి
కొంతఁదెలుపఁగాంత విను... చింతదీర.

ఐశ్వర్యము.

శ్లో. నారాయణాయనమ ఇత్యయమేవ సత్యం
సంసారఘోరవిషసంహారనైకమంత్రం
శ్రణ్వంతు భవ్యమతయో మునయోస్తరాగాః
ఉచ్చైస్తరాముపదిశామ్యహమూర్ధ్వబాహుః

టీక. నారాయణాయ నమ ఇతి. నారాయణాయనమో యని అయమేవ ఇది అత్యేవ సంసారఘోర విషసంహారనైకమంత్రం సంసార సంసారమనెడి ఘోరతర భయంకరమయిన విషవిషము యొక్క

సంహారకా సంహరించుచున్నందున ఏకైకము శ్రేష్ఠమయిన
మంత్రం. మంత్రమును. శ్రేష్ఠమతయః. శ్రేష్ఠమం
కళ(ప్రదమయిన. మతయః. ... లుగలిగినటువంటి
యుం. అస్త్రాణాం. అస్త్రప్రశంసం జేయుచుండిన. రాణాం
కీర్తికలుగలిగిన. మునయః. మునులు శ్రేష్ఠులంతమ
విందురుగాక. సత్యం. యదార్థము. అహం. ఈ మంత్ర
మునం ఊర్ధ్వబాహుః చేతులు. పైకెత్తి పిలిచెది
అహం నేను ఉక్త్వా, స్త్రీణాం మిక్కిలియు ఉపది
శామి ఉపదేశింపుచున్నాను, ఇతి నారసింహపురాణే

౧౦. మంత్ర శ్రేష్ఠార్థ లఘుత్వము.

౧౧. ప్రణవము నమః పదంబు నారాయణాయ
(తెలు) నునిపించ గూర్చిన తిరుమంత్రమయ్యె నిచుచు
శ్రుతులు స్మృతులును శాస్త్రములు హితవుమెఱయ
బలుకుచున్నవి వినుము యద్భుచరిత

లక్ష్యము.

శ్రు. ఓమిత్యగ్రే వ్యాహరేత్ నమ ఇతి పశ్చాత్
నారాయణాయేత్యుపరిష్టాత్ ఓమిత్యేకాక్షరం
నమ ఇతి ద్వే అక్షరే నారాయణాయేతి పంచాక్షరాణి
ఏతద్వై నారాయణస్యాష్టాక్షరం పరమద్యేతి
అనపబ్రువస్సర్వమాయురేతి విందతే ప్రాజాపత్యం.
రాయస్పోషం గౌపత్యం, తతోమృతత్వమశ్నుతే

తత్తో మృత తత్వ మశ్నుత (ఇత్యథర్వణాశిరోప
నిషది) ॥టీకే॥

ఓమిత్యగ్రే వ్యాహరేత్ అగ్రే ముందుగా ఓమితి ప్రణవమును వ్యాహరేత్ ఉచ్చరించవలెను నమ ఇతి పశ్చాత్ అనంతరమందు నమ ఇతి నమః అనియు నారాయణాయేత్యుపరిష్టాత్ ఉపరిష్టాత్ ఆమీదను నారాయణాయేతి: నారాయణాయ యనియు ఉచ్చరింపవలెను. ~~ఓమి~~ ఓమిత్యేకాక్షరం: ప్రణవమనెడి యొక యక్షరము నమ ఇతి ద్వే అక్షరే నమః యను నది రెండక్షరంబులు నారాయణాయేతి పంచాక్షరాణి నారాయణాయ యనునది అయిదక్షరములు ఏతద్వై నారాయ~~ణాష్టాక్షర~~ణాస్యాష్టాక్షరం పదం ఏతత్ ~~వై~~ ద్వై ఇదే నారాయణస్య శ్రీమన్నారాయణమూర్తియొక్క అష్టాక్షరం ఎనిమిది అక్షరములుగల పదం మంత్రము,

## ౨౧. మంత్రోపదేశప్రాప్తిమాత్రోద్భవ ఫలవిచారఘట్టము.

గీ. ఇలను సన్మంత్రమహిమల నెన్నదరమె?
శ్రవణమాత్రంబు తెలియఁడనెవ్వఁడు విని దివిని
గలశుభంబుల జేకొనఁ గలుగు ననుచు

నిగమములు దెల్పుచుండు నిర్వృతి మెరయు
హైనవ్యాపిన ప్రకారము:-

శ్రు. యోహం వైనారాయణస్యాష్టాక్షరం పదమాప్నోతి
తత్ బ్రహ్మ తత్త్వమశ్నుతే.

యోహంవై, నారాయణః యాతి యుక్త్యా అష్టాక్షరం ఓంనమోనారాయణాయ అనియెడి యక్షరములుగల పదం మంత్రమును అద్వైతి గురూపదేశానం బొందుచున్నాడో సః వాఁడు. అనుగ్రహవః పఠించుచున్నవాఁడయి సర్వాం సంపూర్ణమాయిన ఆయుంశతాయుష్యమును పతి పొందుచున్నాడు మఱియు విందతే ప్రాజాపత్యం బ్రాహ్మత్వమును విందతే పొందుచున్నాడు రాయస్పోషం గౌపత్యం రాయస్పోషం. ధనసేరతుల్య ధనసంపత్తియును గోపత్యం ఇంద్రతుల్య ప్రభుత్వమును, అమృతత్వం: మోక్షమును తతః ఆ అష్టాక్షరమంత్రోపదేశము వలన అశ్నుతే పొందుచున్నాడు నిరూఢిగా ఆ వేదపురుషుఁడు తిరిగి చెప్పుచున్నాడు తద్బ్రహ్మ తత్త్వమశ్నుతే ఇతి ఈ అష్టాక్షరమంత్రోపదేశమును బొందినవాఁడు నిజముగా మోక్షమును బొందుచున్నాడు ఇత్యధర్వణశిరోపనిషది.

వ. అని బోధించి యామనువరంబునందొప్పెడి బ్రహ్మ

క్షరమంత్రంబులకుంగల వ్యాఖ్యార్థంబు తెలింగింపం దలంచి
మఱియు నిట్లనియెం.

క. నారాయణ పదవాచ్యము
ధరాత్ములు మెచ్చ ముత్తదెవిపతి నిష్ఠ
నారాయణ నమః పదముల
కారతి నెబోధ పరతు నది విను వయ్యా

గీ. ప్రణవమఖం బీజమున నైన ప్రత్యగాత్మ
యనఁగ పురుషుండనంగ నా యఖిలభూత
వితతి యనన నీశ్వరుండన విశ్వమనఁగ
బ్రహ్మమనఁగను వాచ్యమయి వసుధ నలరు.

అర్థము:-

ఓమితి బ్రహ్మ ఓమితిదగుంసర్వం ఓమిత్యేతదక్షరమిదమితి తైత్తిరీ
యోపనిషత్॥ ఓమితిబ్రహ్మ ప్రణవమనే దే బ్రహ్మము ఓమితి ఇదగుం
సర్వం ప్రణవమనే దే పరిదృశ్యమానమగు నీ సర్వప్రపంచమును ఓమితి ఏ
తదక్షరం ఇదం ప్రణవమనే దే క్షయరహితమయిన యీ మంత్రబీజము
మఱియును:-

శ్లో. ప్రణవోహి పరంబ్రహ్మ ప్రణవశ్చ పరస్మృత ఇతిస్మృతిః.
టీక. ప్రణవోహి ప్రణవమె పరబ్రహ్మ. పరబ్రహ్మము ప్రణవశ్చ:
ప్రణవమె పరస్మృతః ఉత్తమోత్తమముగాం జెప్పంబడినది.
ప్రత్యగానందం బ్రహ్మపూరుషం ప్రణవస్వరూపం అకార ఉకార

రో మకార ఇతి తానేకధా సమభవత్తదేతదోమితి ప్రో

క్తశ్రుతిః॥ టీకే॥

ప్రత్యక్: ప్రత్యగాత్మ అయినటువంటియు. ఆనందం అఖండా

నందమయినటువంటియు పూరుషం పురుషుఁడయినటువంటి

యు బ్రహ్మ పరబ్రహ్మమే ~~అయినటు~~ ప్రణవస్వరూపం ప్రణవ

మనెడు స్వరూపము అకార ఉకార మకార ఇతి అకారము

ఉకారము మకారము తానేకధా సమభవత్తే దేతదోమితి.

తాని ఈ వర్ణత్రయము ఏకదా ఒక్కటిగా సమభవత్

కలుసుకొన్నవయి తత్ ఆదె ఓమితి ఓంకారమనెడి

బీజవరమైనది. విశేషించి ఈ మంత్ర బీజోపాసనవ

లనఁగలుగు ఫలమును జెప్పుచున్నాఁడు.

శ్రు. యముక్త్వా ముచ్యతే యోగి జన్మసంసారబంధనాత్

ఇతి ప్రోక్తా హ్యథర్వణశ్రుతిః.

టీక. యం ఏ ప్రణవమును యోగి భక్తి జ్ఞాన వైరాగ్య

ములు గల పురుషుఁడు ఉక్త్వా జపించి జన్మసంసార

బంధనాత్ జనన మరణ సంసారబంధము వలననుండి ముచ్య

తే విడువఁబడుచున్నాఁడు వాఁడే ముక్తుఁడనఁబడును.

అట్టియీ ప్రణవమే నారాయణాష్టాక్షరీ మంత్ర బీజము.

గ. అయమును చతుర్థికా పరాత్మని కొర

కనుచు వాచ్యమమరు నరయన మయ

సంగనర్థమగు నవతజనానందప్రాప్తి
కారణంబటంచు ధీరహృదయ.

° లక్ష్యము. "నమః స్సంపత్తిహేంతవే" ఇతిమంత్రో యామశ్రే

క. నమయన త్స్వంపదవాచ్యము
నమరగ నారాయణాయన నగుతత్పదవా
చ్యము విను మాయ యసంగను
సమరసమగు నసిపదార్థ సంగతి నొప్పున్.

వ. అని బోధించిన తియు నిట్లనియె.

క. నారాయణామంత్రార్థం
బారతి నెఱింగి భక్తి నెప్పుడు గావిచే
ధీగులకుఁ గలుగుఁ దప్పర
వారకారధహయచయంబువై కుంఠంబున్.

క. అనవిని శిష్యుం డనితెంను
మనమున సంతోష మొప్ప మహితంబగునే
మనురాంఙార్థము దెప్పితి
వనఘా నినుఁ బాగడఁ దరమె యజ్ఞునకు నయినన్

వ. అనియిట్లు గురువరుని బ్రశంసించుచుఁ బ్రశ్రి
తాపూర్వకంబుగా నమస్కారంబు లొనర్చి వరవమల
ఘటిత నిటలతటుండయి యిట్లనియె.

క. హరిహరహిరణ్యగర్భుల

కర మొప్పఁగ ననుఁ గొంచఁ గడ తేర్చుటకున్

దారలంచుమవిందు వారిలాం

హరియొకఁడెట్లయ్యె నాధుఁ డంతయుఁ జెప్పుమా

వ. అనిన నాచార్యుండిట్లనియె.

22. శ్రీమాం నారాయణ సర్వకారణత్వ

సర్వమయత్వ సర్వేశ్వరత్వ సర్వపరిపూర్ణత్వ

నిత్యత్వాది విచారణ ఘట్టము.

క. ఒక్కఁడె రాజంతటికిని

పెక్కులు తేరిదియు నిజము విను మా విష్ణుం

డొక్కఁడ జూచిన దప్పక

నక్కఁడనే తోఁచుచుండు నంతటం దారధై.

వ. అట్లుగుటం జేసి.

క. నారాయణుఁడఖిలాత్ముఁడు

నారాయణుఁడఖిలమునకు నాధుఁడు దలఁపన్

నారాయణాంశమఖిలము

నారాయణుఁడె సదాత్మ నానావిధులన్

ఇందుకులక్ష్యము.

" సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువమిత్యాది

శ్రుతేః" ఇందుకు దాహరణార్థం వాక్య సంగ్రహము.

సహస్రశీర్షం సహస్రం సంఖ్యాతేని శీర్షంశిరస్సులు

గలవాఁడును ~~పరమంపదం మోక్షస్థానముగాను తెలియఁదగి~~
~~నది విశ్వ~~ విశ్వాక్షం సర్వద్రష్టయును విశ్వశంభువం
జగదానందకరుఁడును విశ్వం జగద్రూపుఁడును అయిన
నారాయణుఁడనే దేవం సర్వోత్తముని అక్షరం నాశరహి
తునిగాను పరమంపదం మోక్షస్థానముగాను తెలియఁదగి
నది. విశ్వతః జగత్తుకంటె నిత్యం నిత్యునిగాను పరమాం
ఉత్తమునిగాను నారాయణం నారాయణుఁడనే హరిం
(శ్రీ) మహావిష్ణువును విశ్వం పూర్ణునిగాను తెలియఁదగినది
ఇదం విశ్వం ఈ సర్వజగత్తును పురుష ఏవ విరాట్పురుషుఁ
డయిన నారాయణుఁడేను. తద్విశ్వం ఆ జగత్తును
ఉపజీవతి : రక్షించేవాఁడు విశ్వస్య జగత్తుకు పతిం
ప్రభువును ఆత్మేశ్వరం ఆత్మజీవులకు ఈశ్వరం
రక్షకుఁడును శాశ్వతం నిత్యుఁడును అచ్యుతం:
నశించనివాఁడును శివం మంగళకరుఁడును అని, నారా
యణం నారాయణుని మహాజ్ఞేయం మహత్తే:జ్ఞానా
తిశయమువలన జ్ఞేయం తెలిసికొనఁదగినవాఁడు. విశ్వా
త్మానం సర్వాంతర్యామియు పరాయణం ముక్తిస్థానమును
ఆ నారాయణుఁడేను. నారాయణ పరః నారాయణుఁ
డనే పరమపురుషుఁడు జ్యోతిః తేజోరూపుఁడును
నారాయణః నారాయణుఁడు పరః ఆత్మా పరాత్మ

స్వరూపుడును నారాయణం పరంబ్రహ్మ — నారాయణః
నారాయణుడె పరంబ్రహ్మ: పరబ్రహ్మమును తత్త్వం
యథార్థమును నారాయణం నారాయణుడేను. సర్వం
జగత్ సమస్తప్రపంచమును కించిత్ కొంద్దిగాను దృశ్య
తే చూడఁబడు చున్నదియు శ్రూయతేపివా వినఁబడు
చున్నదియును యత్ ఏదికలదొ ఆదియంతయు
నారాయణుండే యనియు అంతః లోపలను బహిశ్చ
వెలుపలను తత్సర్వం ఆ సకలమును వ్యాప్య వ్యాపించి
నారాయణః శ్రీమన్నారాయణమూర్తి స్థితః ఉన్నాడు.
ఇత్యుపర్యద్వ్యయాజ్ఞికోపనిషది.

వ. అనిన శిష్యుం డిట్లనియె.

గీ. ధాత్రిముఖులెల్ల హరిపరతంత్రులనుచుఁ
చెప్పితివి మున్నిప్పుడా తీర్థపాదుఁ
డేను సర్వంబునుంటి వదెట్టుగాను
పద్మలోచనుఁడయ్యెనో పలుకుమయ్య

వ అనిన నాచార్యుం డిట్లనియె.

గీ. మృద్ఘటంబుఁ దలఁప మృత్తికయయినట్లు
కార్యకారణముల కవిమితత్వ
హరియె సృష్టిశివుఁడు నంబుజభవుఁడును
సర్వలోకములనుసాధుతిలక.

వ. మఱియును.

సీ. జలధిలోని జలములు జలధరంబులు దెచ్చి
ధరణిపై విడుచునంతటను వాటి
దక్షోదకంబని వాడుదురదికొంద
కాల్వలఁ జొచ్చిన కాల్వనీర
టందురవ్వియు గంగ యందు జేరిన మహా
గంగోదకంబని ఘనత జేతు
రవియును పటికకంధి నమర గూండిన నాటి
జలధిజలంబని పలుకుచుందు
రిట్లు బాహ్యపు పేళ్లెనెట్లనఁగాని మ్యా
వెందలి జలమ గాదె? తుదకుఁ జూడ
నట్లు తెలిసికొమ్ము హరియె సర్వంబని
సంశయింపనేల? జడతనొంది.

లక్ష్యము:—

శ్రు. బ్రహ్మాత్మ్యాధర్వణం శిరః. టీక... బ్రహ్మనారాయణః.
సత్యలోకము మొదలుకొని దిగువనుండెడి సకల లోకము
లకు ప్రభువగు చతుర్ముఖుఁడు నారాయణుఁడేను.
శక్రశ్చనారాయణః స్వర్గమర్త్య పాతాళలోకములకు ప్రభు
వయిన దేవేంద్రుఁడును నారాయణుఁడేను శివశ్చ నారాయ
ణః కైలాసమునకు మొదలుకొని దిగువలోకములకధిపా

రియయిన శివుఁడును నారాయణుఁడేను. దిశశ్చ
నారాయణః దిక్కులును నారాయణుఁడేను. అధశ్చ
నారాయణః. క్రిందిదయిన యీ అవిద్యాపాదము
ను నారాయణుఁడేను అంతర్బహిశ్చ నారాయణః
ఈ నాల్గు పాదముల లోపల వెలుపల నారాయణుఁడేను
సర్వవ్యాపకో నారాయణః అంతటఁ వ్యాపించిన వాఁడు
నారాయణుఁడేను. నారాయణ ఏవ నారాయణుఁడే.
ఇదగ్ సర్వం ఈ సర్వప్రపంచమును యద్భూతం ఏది భూతంగడ
చినదో యచ్చ ఏది భవ్యంగడవఁబోవునన్నదో అవియ
న్నియు నారాయణుఁడేను. నిష్కళంకః కళంకరహితు
ఁడును నిరంజనః మాయారాహిత్యుఁడును నిర్వికల్పః వికార
శూన్యుఁడును నిరాఖ్యాతః నామరూపవర్జితుఁడును శుద్ధః
పరిశుద్ధుఁడును దేవః స్వయం ప్రకాశుఁడును ఏకః ముఖ్యుఁ
డును నారాయణః నారాయణుఁడేను న ద్వితీయోస్తి ఆ
శ్రీమన్నారాయణమూర్తి కంటె మఱియొకఁడెవ్వఁడు లేఁడు.
ఇత్యథర్వణోపనిషది. అట్లగుటంజేసి॥

అవతరణిక॥ మూలకందం ముకుందం అనునట్టి తురీయ
విద్యాపాదంబునకు త్రిపాన్నారాయణుఁడే మూలకారణుఁ
డని తెలిసికొనిన జీవుఁడు భగవత్స్వరూపుఁడగుచున్నాఁడని
చెప్పుచున్నాఁడు.

గీ. హరియె జగములు జగములు హరియ యనుచు
నెఱిఁగి సేవించు సాధు తింపెనయు పరమ
పదము జేరుదు రిహలోక పదవి ననుభ
వించి సత్ప్రాప్తి దితం బ్రలు వించిబరువ.

తాత్పర్యము. ప్రాణోప్తేక్షోపనిష ద్ప్రకారము గాను నారాయణో జ్ఞపర బ్రహ్మము తెలాడిసముఁడును అధికుఁడును అయిన ప్రభువు ఎందుఁను లేదని ఏవం ఈ ప్రకారము గాను తచ్చిద్యాం బవఁడయినసే, వేద తెలియుచున్నాఁడో సఃవాఁడు విష్ణు రేవ విష్ణుస్వరూపుఁడై భవతి అగుచున్నాఁడు ఇతి ప్రాణోత్తి ధర్వణా శిరః

౨౩ భగవదవతారప్రమేయ ఘట్టము.

గీ. ఇట్లు చెప్పఁబడిన యీ మహావిష్ణుండు
యుగయుగంబునందు నిగమ ధర్మ
పాలనంబుకొఱకు బహుపరాక్రమ మొప్ప
నవతరించుచుండు నమరులలర.

తాత్పర్యము:-

ఉటంకింపు॥ ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.

టీక. ధర్మసంస్థాపనార్థాయ శ్రుతిస్మృతులయందు చెప్పఁబడిన ధర్మములను చెడకుండ కాపాడుటకు యుగేయుగే ప్రతియుగమునందును అహంనేను సంభవామి అవ

తరింతురు మనుష్యులు. ఇతి భగవద్వచః. అగశ్లో॥

వ. అట్లుగావున.

గీ. భగవదవతారములకొప్పు భవ్యనామ
పంక్తి యా భగవంతుఁడె వాంఛ్యుఁడనుచు
దెలిసికొనుమయ్య నెమ్మది దిటముమెఱయ
నట్లు దెలిసిన నిర్వాణమందవచ్చు.

వ. ఇట్లగుటంజేసి.

గీ. ధరణి మత్స్యాదిసకలావతారములను
భక్తి వైరాగ్య భావంబు పరిఢవిల్ల
గాంచి పొందుదు రపవర్గ మలఘు మహిమ
మేని విభుతెల్ల నిష్టానుమతి జెలంగ.

వ. ఇదియునుంగాక,

అవతరికారిక॥ భగవద్భక్తి పాత్ర సకలసత్కర్మలఫల
ముగలుగుచున్నదని చెప్పుచున్నాఁడు.

గీ. సర్వవేదంబులందును సర్వతీర్థ
యాత్రలందును జొప్పడునట్టిఫలము
హరినిఁ దలఁచినఁ గలుగు నంచఖిల ~~ఖలమూ~~ నిగమ
వితతి బోధించునని జామి దివిమల హృదయ.

లక్ష్యము.

శ్లో. సర్వవేదేషు యత్పుణ్యం సర్వతీర్థేషు యత్ఫలం

తత్ఫలం పురుషః ఆప్నోతి స్తుత్వా దేవం జనార్దనమితి.
సంధ్యావందనే॥ ఇతిశ్రుతి యనుసందంతు సమాధాన
ము॥ బ్రహ్మాదులచే సృష్ట్యాదిని సకల వేదంబులందు నలంగ
ల సారాంశంబు ఎంచిందెడి మంత్రంబు సంగ్రహించి సంధ్యా
యందు నుపాసించుటకయి సంధ్యావందనంబుఁ గూర్పంబ
డియెను. వేదంబులిప్పుడధ్యయనంబు సేయువారలేకుం
డుటం జేసి యందుఁగల కొన్ని శ్రుతులు విభిన్నంబులయ్యె
నట్టి విభిన్నశాఖలయందుగల కొన్ని మంత్రంబులు
శ్లోకంబులుగాఁ దోచఁబడినను ఆ విశ్రుతి మంత్రంబు
లుగాఁ దెలియమని తెలిసిన సాధువులచేఁ దెలుపంబడు
చున్న దందువలన నిందున శ్రుతి నుదహరణంబుగాఁ జేర్చ
కొనంబడియె మఱియును.

అవతరణిక॥ ఏ దేవతకు నమస్కరించిన ఆ నమస్కార
ము శ్రీమన్నారాయణమూర్తికే చెందునని చెప్పుచున్నాఁడు.

గీ. సకల దేవతలకు సద్భక్తితో మ్రొక్కు
మ్రొక్కులెల్ల హరికి ముట్టు ననుచు
శ్రుతులు బలుకు నదియు మతి దలంపఁగ లేక
షదవాదములకుఁ జెనఁగఁదగదు.

లక్ష్యము:-
సర్వదేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతీతి సంధ్యావందనే

వ. అట్లు చెన్నంగుండలం బిజనం.

అవతారికః॥ మతభేదబుద్ధి నాం. దినను — ఆయా దేవతా
రూపములచేత శ్రీహరియె తగుఫలము నిచ్చుచుండునని
చెప్పుచున్నారు.

గీ. శైవ శాక్తేయ మఖ్యంలలో జగతి నరయు
నేమతస్థుడు ఏ వేల్పు నెలమిఁగొలుచు
నతనికా రూపమున శ్రీహరి చెలంగి
తగినఫలమిచ్చు సర్వాత్ముఁడగుటఁజేసి.

— ౨౪. అనన్య శరణ్య భక్తజన
ప్రచార ఘట్టము.

వ. ఇట్లు. గీ॥ చెడ్డెడిఫలమార్గముల నాంది చెడినపిదపఁ
దిరిగి భువిచేరుటది యేమి తెరువటంచు
నితరమును రోసి హరిఁగొల్చి నిత్యశాశ్వ
పదము నాందెద రనఘులు ముదమెసంగ.

వ. అట్టి పరమభాగవతాగ్రగణ్యులు.

సీ. పాండలోచన జిహ్వ పాదచేతశ్శ్రోత్ర
మూర్ధనాశికముల పుట్టుక ఫలము.
పుండరీకాక్షుని పూజించుటవ్విభుల
దర్శనోత్సవము చేఁదనరుచుండుట
హరిగుణకీర్తనలమరఁజేయుటయుచ్చ

తని మందిరంబుల త్రోవఁ జనుట
భగవత్పదాంబుజ యుగము దలంచుట
విశ్వంభరుని కథల్ వినుచునుంట
ముదమున చెన్నొంద శౌరికి మ్రొక్కిడుట
శ్రీధరార్పిత ఘనతులసీ సువాస
నలను గైకొనుట వివిధ పోదలఁ బనసనుచు
నట్లొనర్తురు ముక్తికై యనవరతము

॥ లక్ష్యము ॥

శ్లో॥ జిహ్వే కీర్తయ కేశవం మురరిపుం చేతో భజ శ్రీధరం
పాణిద్వంద్వ సమర్చయాచ్యుత కథాం శ్రోత్రద్వయ త్వం శృణు
కృష్ణం లోకయ లోచనద్వయ హరేర్గచ్ఛాంఘ్రియుగ్మాలయం
జిఘ్ర ఘ్రాణ ముకుంద పాదతులసీం మూర్ధన్నమాధోక్షజం।

తాత్పర్యము:-

కేశవుని జిహ్వయందు గీర్తనఁజేయుము మనస్సుచేత మురాంతకుని భజింపుము. కరము చే శ్రీధరుని బూజింపుము శ్రోత్రద్వయము చే శ్రీ మహావిష్ణు చరిత్రమును వినుము నేత్రద్వయముచేత కృష్ణుని జూడుము, శ్రీ విష్ణువు యొక్క పాదపద్మస్థానమును గూర్చి వెళ్లుము, శ్రీ మహావిష్ణువు యొక్క పాదమందలి తులసీ దళమును శిరస్సునందుం చుకొనుము।

వ. అందు నారదాండజవర్ణితుండగు పురుషుని నిరంతరవృత్తినె ఱింగింపెద సావధానచిత్తుండవయి యాకర్ణింపుము.

సీ॥ భక్తియోగ విహార పావన హృదయుండు
మేను తానని తెలిసి మెలఁగునపుడు
హరికింకరుఁడనను మనదరియు వ్యాఖ్యపేర
పను తెల్లఁజేయు సమ్మతము గాదవ.
జీవాత్మబుద్ధి తెలిసినవేళ నతఁడుం దన్
హరిదివ్య తేజోంశమని తలంచు,
దనర నిత్యానిత్య తత్త్వ ప్రబోధియయి
హరియ విశ్వంబని యలరుచుండు
నిట్లు హరిపరతంత్రుఁడై యిహసుఖంబు
తుచ్ఛమని యెంచి సాధులతోడఁ గూడి
శ్రీరమావిభుసత్కథల్ జెప్పికొనుచు
బ్రతుకుచుండును కాలంబు బుధులు మెచ్చ.

లక్ష్మణము:-

శ్లో. దేహబుద్ధ్యా తు దాసోహం జీవబుద్ధ్యా త్వదంశకః
ఆత్మబుద్ధ్యా త్వమేవాహం ఇతి మే నిశ్చలా మతిః.

టీక॥ దేహబుద్ధ్యా = దేహబుద్ధులచేత త్వదంశకః మీయొక్క అంశవలవాఁడను. ఆత్మబుద్ధ్యా ఆత్మబుద్ధులచేత త్వమేవాహం = నీవే నేను, ఇతి = అని

తే: నా వెంకట్ర  నిశ్చలమతిః = నిశ్చయమయిన అభి
ప్రాయము. ఇదియునుంగాక.

గీ. పృథివిం బ్రారబ్ధవశమునఁ బొందునట్టి
సుఖము దుఃఖంబునకు వికృతి పొందకెప్పుడు
గలుగు వేళల హరిభక్తిగరిమ తొలఁగద
నిష్ఠ మృష్టాన్నమును భుంజియించు ననఘు॥

లక్షణము:-

శ్లో॥ ప్రారబ్ధం పుష్యతి వపురితి నిశ్చిత్య నిశ్చితః
భక్తిజ్ఞానవైరాగ్యశ్చ భగవదర్పిత బుద్ధిమాన్.

టీక॥ వపుః శరీరము  ప్రారబ్ధం = పూర్వజన్మకృతకర్మ
పుష్యతీతి = పోషించుచున్నదని నిశ్చిత్య నిశ్చయించి భగ
వదర్పితబుద్ధిమాన్ భగవంతునియందర్పించిన బుద్ధిగల
వాఁడు, భక్తిజ్ఞానవైరాగ్యైః = భక్తిజ్ఞానవైరాగ్యముల
చేత నిశ్చితః = నిశ్చయించుకొన్నాను.

గీ. శాస్త్రవాదంబునకు బుద్ధిఁ జనఁగనీక
భక్తి వైరాగ్య విజ్ఞానపరులఁ గూడి
భగవదర్పిత~~[illegible]~~ముగ నిరుల్ వరలుచుండ
భువిని హరిగోష్ఠి నాయువుఁ బుచ్చుచుండు

లక్షణము:-

శ్లో॥ ఆత్మజ్ఞాన విహీనం యత్ తర్కం తద్దూరవం నయేత్.

టీక॥ యతః = ఏతర్కము ఆత్మజ్ఞానవిహీనం = గురూప
దేశాత నార్జించుకొన్న ఆత్మజ్ఞానము బంతలేనిదో యనఁగా
వేదాంతశాస్త్రముతోఁ గూడికొనని దనుట తత్తర్కం
ఆతర్కము రౌరవం రౌరవమనే పేరుగల నరకమును
నయేత్ = పొందించెడిని. ఇతి పండితవచః.

వ. మఱియు శ్రీనారాయణతీర్థులవారు రచించిన సప్తమ
తరంగమునందుఁగల కీర్తనలోని చరణము:-

॥ నిశ్చితమశేష నిగమాంత వచనైః
యత్తత్వమిత్యఖిల సారమసంభ్రాంతైః
తర్కశతైరపి దృష్టైతర సమాధ్యం
భారమతిగమ్యమవధారయ సత్యం
అద్వయమఖండిత మశేష జగదాది|యత్ర చ
Contin: జగత్త్రితయమాస్థమనంతే.

తా. వేదాంతవచనములచేతను అఖిలసారానుభూతము
యైన తర్కశాస్త్రములచేతను, ఏతత్త్వము నిశ్చయిం
పఁబడినదో, ఏయనంతునియందు జగత్త్రయము ప్రతి
ష్ఠింపఁబడినదో అశేషజగత్తునకు మూలమైనదియో అద్వి
తీయం... స్వరూపమును ద్వయరహితమును ఖండింపఁబడ
నిదియును నగు దానిని నిశ్చయంబుగఁ గ్రహింపుము.

వ. అనిన శిష్యుం డిట్లనియెం,

గీ. కొంద ఱిలరామకృష్ణాదులందు భక్తి
సమరఁగొల్పురు గొంద ఱవ్యక్తతత్త్వ
మరయుచుందురు వారిలోన ధికులెవరు
తెలుపఁగదవయ్య గురువర్య భిజయార్య!

౨౫. సగుణ నిర్గుణ తారతమ్య
విచార ఘట్టము.

గీ. అనిన విని గురుఁడనియె నోయమలహృదయ!
భక్తిచే దేవదేవుని రక్తిఁ దనరఁ
గలుఁగువారెల్ల యోగవిత్తములటంచు
నెఱుఁగుఁడొప్పగు హరిచెప్పు డిష్ట మిదియె

లక్ష్యము:-

శ్లో. మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయోపేతాస్తే మే యుక్తతమా మతాః

టీ॥ యే. ఏభక్తులు మయి: నాయందు మనః మనస్సును ఆవేశ్య: ఉంచి నిత్యయుక్తాః నిరంతరసమాహితచిత్తులయి పరయా: ఉత్కృష్టమయిన శ్రద్ధయా శ్రద్ధచేతను ఉపేతాస్సంతః: కూడినవారలయి మాం: నన్ను ఉపాసతే: ధ్యానముచేయుచున్నారో తే-వారు యుక్తతమాః: మిక్కిలి యుక్తులయినవారలని మే: నాకు మతాః: ఇష్టులు (ఇతి భగవద్వచః అ ౧౨ శ్లో ౨)

వ. మఱియును,

గీ. భక్తిసాధన బోధలం బడయువారు
శాంతిదినారాయణుని యందె జొత్తురయిన
క్లేశతరమగు తద్బోధ కేవలముగ
నదియునెట్లన్న వినుమయ్య సతుల ధైర్య

లక్ష్యము:-

శ్లో. యేత్వక్షరమనిర్దేశ్యమవ్యక్తం పర్యుపాసతే
సర్వత్రగమచింత్యంచ కూటస్థమచలం ధ్రువం

టీక. యతేః ఎవ్వరయితే అక్షరం నాశరహితమయిన దియు అనిర్దేశ్యం నిర్దేశింపఁగూడనదియు అవ్యక్తం రూపాదిరహితమయినదియు సర్వత్రగం అంతటను వ్యాపించియున్నదియును అచింత్యం ధ్యానింపఁగూడనదియును, కూటస్థం సర్వకారణమయినదియు అచలం: చలించనదియు ధ్రువం: నిత్యమయినదియగు బ్రహ్మమును పర్యుపాసతే ఉపాసనజేయుచున్నారో వారును,

(ఇతి భగవద్వచః అ ౧౨ శ్లో ౩)

శ్లో. సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః.

టీక:: ఇంద్రియగ్రామం ఇంద్రియసమూహమును, సన్నియమ్య తెన్నగా నిగ్రహించి సర్వత్ర సమస్తకాలము

లయుందును సమబుద్ధయః సమబుద్ధిగలిగియుండు
వారలును యే:ఎవరో తే:వారలు మామేవ ప్ర
ప్రాప్నువంతి = పొందుచున్నారు.

(ఇతి భగవద్వచః అ. ౧౨ శ్లో ౪.)

గీ. వాఙ్మనంబులకందని వస్తువగుట
పొసఁగ నవ్యక్త మప్పుడు బొడమినట్టి
తత్త్వగతినొందుటది కష్టతరముగాదె
మదినిఁదలపోయ దేహాభిమానులకును

లక్ష్యము.

శ్లో. క్లేశోఽధికతరస్తేషామవ్యక్తాసక్తచేతసాం
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే

టీక. తేషాం = ఆ. అవ్యక్తాసక్తచేతసాం పరబ్రహ్మమునం
దాసక్తమయిన చిత్తముగలవారికి క్లేశః కష్టము అధిక
తరః మిక్కిలి అధికమయినది. హి: ఏ కారణమువలన
దేహవద్భిః = దేహాభిమానము గలవారిచేతను అవ్యక్తా
అక్షరస్వరూపమయిన గతిః మార్గము దుఃఖం దుఃఖమ
యినట్లు అవాప్యతే = పొందఁబడుచున్నదో
అందువలన ॥ ఇతి భగవద్వచః అ. ౧౨ శ్లో ౫.॥

గీ. ఇహపరశుభములనొసఁగెడు హరిభక్తి
నెడలి కేవలబోధకాననరజనుట

తండులంబులు గొని మెండుగా పొల్లున
దంచఁబూనెదు భంగి ధరణి కష్ట
మొకటి దక్క గిట్టి గాని మొనరదు శుభమెందు
నట్టిగుంటను జేసి యనవరతము
సత్సిత్సుఖాత్ముని సరసిజనేత్రుని
సర్వేశ్వరుని హరిన్ సర్వమయుని
వరభక్తి తమయందు వరదు నాత్మఁ
దగిలి గొలిచెడి వారె పో ధన్యులరయ
నెన్న నేతి ~~[illegible]~~ కి హేతువయి చెన్ను దనరు
కరణి బోధనం సద్భక్తి కారణంబు.

లత్ర్యవము:-

శ్లో. శ్రేయ స్స్రుతిం భక్తిముదస్య తే విభో క్లిశ్యంతి యే కేవల
బోధసిద్ధయే, తేషామసౌ క్లేశల ఏవ శిష్యతే
నాన్యద్యథా స్థూలతుషావఘాతినాం ॥

టీక.. విభో : జగన్నియామకుండయిన యో శ్రీమన్నా
రాయణమూర్తీ శ్రేయసాం విహితాముష్మికఫలము
లను స్రుతిం పుట్టించునటువంటి తే మీయొక్క
భక్తిం= భక్తిని ఉదస్య వదలి యే = ఏ జనులు కేవల
బోధసిద్ధయే కేవల = భక్తిశూన్యమయిన బోధ జ్ఞా
నమునయొక్క సిద్ధయే సిద్ధికొఱకు క్లిశ్యంతి =ఆ

యాంస పడుచున్నారో తేషాం వారికి క్లేశల యేవ: ఆ
యాంసమయ్యేవ శిష్యతే: శేషించుచున్నది. అన్యత్తు
న: మఱి యొంకటి లేదు. యథా: ఏలాగంటె స్థూలల
తుషావఘాతినాం స్థూలవిస్తారమయిన టువంటి
తుషా: ఊకను అవఘాతినాం: దంచెడి వారికి వలె
నే. ఇతి చతుర్దశి బ్రహ్మావచః శ్రీమహాభాగవతే.

గీ. కారణంము లేక కార్యంబు గలుగ దెప్పుడు
నట్లుగావున నిరతంబు నవుల భక్తి
నమర పెంపొందకున్న నవ్యక్తమార్గ
మరయ శక్యంబె వానికి నతివరునికయిన

గీ. ఫలవిరహిత కర్మభక్తికి హేతుం వా
మంక్తికరయభక్తి మూలమగుసు
కారణంబుసుమ్ము కైవల్యఫలమంద
తత్వబోధ జేయు ధన్యసేవ.

గీ. వివిధ కర్మఫలము విడిచిన భక్తుల
తొరాడ హరిని (గొలుచు వాం(డు మనుబు
డయిన దను బు(డయిన నమరు(డయినను శ్శూ
తుర్యముక్తి నొందు నార్యులలర.

వ. అట్లుగుటం జేసి.

క. మనమును బుద్ధిని నిరతము

వనజాంబకునందు నిలుపు వరభక్తుండవయి

విను మట్లు నిలుప జారదనగు

వనదశ్యాముని విశుద్ధపదము కుమారా!

లక్ష్యము:-

శ్లో. మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ

నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః

టీక. మయ్యేవ: నాయందే బుద్ధిం: బుద్ధిని నివేశయ:
ఉంచుము మయి నాయందె మనః మనస్సును ఆధత్స్వ
ఉంచుము అత ఊర్ధ్వం: ఈ దేహము నశించిన పిమ్మట
మయ్యేవ: నాయందు నివ~~సి~~సిష్యసి ఉండగలవు.
న సంశయః సంశయము లేదు (ఇతి భగవద్వాక్యః అ॥ శ్లో॥)

గీ. వేయునేల కథలు విను వేద వేదాంగ

వరపురాణవితతి సరసి చూచి

నిశ్చయింపనయ్యె నీరజనాభుని

గొలువకున్న ముక్తి గలుగదనుచుం.

లక్ష్యము. మోక్షమిచ్ఛేజ్జనార్దనాత్॥

శ్లో. ఆలోడ్య సర్వశాస్త్రాణి విచార్య చ పునః పునః

ఇదమేకం సునిష్పన్నం ధ్యేయో నారాయణస్సదా

టీక॥ సర్వశాస్త్రాణి: సకలశాస్త్రములయందును పునః పు
నః: మాటిమాటికి అనగా నేకమారులు ఆలోడ్య

ఆలోచ్య: ఆలోచించి విచార్య విచారింపఁగా సదా: ఎ
ల్లప్పుడును నారాయణః: భగవంతుఁడు ధ్యేయః: ధ్యా
నము చేయఁదగిన వాఁడు (ఇతి శ్రీమహాభారతే)

వ. ఇట్లుపదేశించి వెండియు నిట్లనియె.

గీ. ఇంత నింత నింత నేల యాలోచింపఁగ
మనమునందు హరిని మరవకున్న
నదియ చాలు చాలు నానందపదమొంద
నిజమటంచు నమ్ము నాదు మదిని

తారక. సముద్ధరణ శ్లోకము:-

శ్లో. తేషామహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్
భవామి న చిరాత్ పార్థ మయ్యావేశిత చేతసాం॥

టీక॥ హే పార్థ! ఓ యర్జునుఁడా మయి నాయందు
ఆవేశిత చేతసాం ఉంచఁబడిన చిత్తముగలిగిన తేషాం
వారలకు అహం: నేను మృత్యు సంసార సాగరాత్:
మృత్యురూపమయిన సంసారమనెడి సముద్రమువలన
నుండి సముద్ధర్తా: ఉద్ధరించువాఁడను న చిరాత్:
శీఘ్రముగ భవామి అగుచున్నాను,
(ఇతి భగవద్గీతా: అ ౧౨ శ్లో ౭)

వ. అని సద్గురువర్యునివలన నయ్యాంతేవాసి గ్రహించి ముముక్షు
త తరతమములుండగం జని నిట్లనియె.

క. సాకారము నిత్యంబుని
రాకారము నిత్యమనుచు నార్యులు శ్రుతులన్
జేకొనిన ఫలవబింతురు
లోకములె బాగంగ సకలలోక స్తుత్యా!

వ. అట్లగుటంజేసి.

గీ. హరియు సాకారుఁ డతఁడు ని~~త్యా~~ త్యాత్ముఁడనుచు
తరము దెల్పితి వట్టి సాకారుని తను
నమరుటెట్లగు నిత్యత్వ మరసి నిజముఁ
దెలుపఁగదవయ్య! గురువర్య! దివ్యచర్య!

౨౬ సాకార నిరాకార విచారణ ఘట్టము.

క. ఆనవిని గురుమణి పలికెను
నను నా విప్రుఁ డడిగినట్లు నారాయణునినే
మును వనజాసనుఁ డడిగిన
వినుపించెను బ్రహ్మవిదులు వేడుక నొందన్.

గీ. వారి సంవాద మఖిల తత్త్వార్థ బోధ
కమును పరమతత్త్వ రహస్యకమును నగుచు
నొప్పు ధర్వణ నారాయణోపనిషది
యనఁగ నందంబులందు నత్యధిక లఘుమహిమ

వ. అట్టి నారాయణోపనిషదియందు ద్వితీయాధ్య
యంబు నీ ప్రశ్నంబునకు సమాధానంబు గలుగు దాని సం

క్షేపంబుగ నెఱింగించెద సావధానచిత్తుండవయి యా
కర్ణింపుము.

గీ. అరయ పరిపూర్ణ సచ్చిత్సుఖాత్మ నతను
గడు నిరాకృతి చెప్పిన గగనమట్లు
జడమనంబడు సాకృతి సదుము వఁడగదు
నతఁడు సాకృతుఁడును నిరాకృతుఁడునగుట

వ. మఱియును.

గీ. పరమ తేజఃప్రపూర్ణుఁడై పరగు కతన
నతని సాకారుఁ డండ్రు ప్రకృతిగుణముల
లవయవియుఁగామి నతని నిరాకృతుండ
టండ్రు వేత్తలు వేదశాస్త్రార్థమరసి

గీ. అతఁడె ఘనతురీయాత్ముఁడం చనఁగ నూర్ధ్వ
మూలమగుచును క్రిందికి ప్రేలఁ బ్రాకి
సకలయుపనిషదర్థమై యుం సర్వమతము
లందు నొప్పారు సాక్షియై యరసి చూడ

గీ. అట్టి నిరుపాధికంబగు నవ్యయాత్మ
నమరఁ దెలియుము నారాయణాహ్వయునిగ
నతఁడు సచ్చిత్సుఖాత్ముఁడట్లగుటఁ జేసి
నిత్యుఁడనఁబడు నెప్పుడు నిర్మలాత్మ.

వ. ఇందు మఱియుఁ గొన్ని విశేషంబులెఱింగించెద వినుము.

సీ. ఉరుసువిద్యానందము భయసాకారము
లలరారుపాదత్రయంబునందు
సందాక్రాటోక్రాటి యరయ నిత్యముముక్త
మనరెండువిధములనమరియుండు
నారతిఁబరగు సాకారమాలారునను
నిరతిశయౌజ్జ్వల నిత్యశుద్ధ
సత్విసుఖాత్మతఁ జాలవెలుంగాండు
నాదిపాదాహ్వయ మయ్యుఁదాయు
నక్ష్య విద్యాఖ్య సాకారమది నశించు
ననృతజడదుఃఖరూపంబునగుటఁజేసి
ప్రథమపాదంబునను నిట్లు ప్రబలు ప్రకృతి
విరాదిపాదత్రయంబున లేదు దలఁప.

వ. కావున.

గీ.॥ ప్రకృతివృత్తినడబిప్రాజ్ఞుఁడవయిహరి
నిత్యుఁడమలుఁడాధ్య నిర్వికల్పుఁ
డనుచుఁదలఁపుమెపుడు నట్లయిన కైవల్య
పదమునందఁగలవు భవ్యగతిని.

లక్ష్యము.

శ్రుతి॥ ఆధ్యేతి హైనంవాచ అధ తద్యాతను ఇతి హైనంవాచ.
భాత్రా గురుంభగవంతం శిష్యుఁడు గురునకు భగవంతునిఁగూర్చి

ఈ భాగని యడిగెను. భగవద్ వైకుంఠస్య నారాయణస్య
చ నిత్యత్వముక్తం. ఓ స్వామీ వైకుంఠము నకును నా
రాయణునకును మీచేత నిత్యత్వము చెప్పబడినది.
స ఏవ తురీయ్యమిత్యుక్తమేవ అదే తురీయమని చె
ప్పబడినది వైకుంఠస్యాకారో నారాయణస్యాకారశ్చ
వైకుంఠమును నారాయణుడును నామరూపవ్యవహార
ములుగలిగియుండెను. తురీయ్యం తు నిరాకారం. తురీ
య్యమయితే నామరూపశూన్యమయి యుండును. సాకా
రస్యావయవైః నిరవయవం నిరాకారం తస్మాత్ అట్లు
గావున సాకారమనిత్యం. సాకారమనిత్యము గనుక సర్వం
నిరాకారమితి శ్రుతిః. అంతయును నిరాకారము.
యద్యత్సావయవం ఏదేది సావయవమో తదనిత్యమితి అది
అనిత్యము ఇత్యనుమానాచ్చేతి ఈ అనుమానము వలననుండి
యు ప్రత్యక్షేణ ప్రత్యక్షవచ్చ ప్రత్యక్షము గాంచుండదగిన
యుండునను అతస్తేరారనిత్యత్వమేవ అందువలన
నుండి వైకుంఠమునకు నారాయణునకు అనిత్యత్వమే
యని వక్తృము లీతం భగవతి చెప్పుటకు తగియున్నది. కథము
క్తం నిత్యత్వమితి అట్టిగా నిత్యత్వము చెప్పితిరి తురీ
యమక్షరమితి శ్రుతిః తురీయము నశించనదని శాస్త్రాం
తరము వల్లనుండును. తురీయ్యం నిత్యత్వం ప్రసిద్ధము.

తులోయ్యాము నిత్యత్వమని ప్రసిద్ధిగలదు. నిత్యత్వా
నిత్యత్వే పరస్పరవిరుద్ధ ధర్మౌ : నిత్యత్వానిత్య
త్వములు పరస్పర విరుద్ధ ధర్మములు. తయోరేకస్మిన్
ప్రాప్త్యాత్యంత విరుద్ధం భవతి - ఆరెంటికిని ఒక ప్రాప్త
మునందుండుట అత్యంతవిరుద్ధమగును తస్మాత్
ఆదిగనుక వైకుంఠస్య నారాయణస్య చ అని
త్యత్వమేవ వక్తవ్యము చితం భవతి వైకుంఠమునకు
నారాయణునకు అనిత్యత్వము చెప్పుటయుచితము
వ. ఇందునకు గురువుత్తరమిచ్చుచున్నాడు.
సత్యమేవ భవతాతి దేశికః పరిహరతి. సత్యమేన
నిపతికి సిద్ధాంతముచేతపరిహరించుచున్నాడు.
ఎలాగంటె సాకారస్తు ద్వివిధః సాకారము రెండువిధములు
సోపాధికో నిరుపాధికశ్చ ఉపాధిసహితమనియు ఉపాధి
రహితమనియును, తత్ర సోపాధికః సాకారః అందు ఉ
పాధి తోగూడుండుట సాకారము కథమితి ఎట్లంటె అవి
ద్యావమఖిల కార్య కారణజాలమవిద్యోపాదకమేవ అవి
ద్యగల సకల కార్య కారణ సమూహము అవిద్యాపాద
ము నాన్యత్ర మటియొకదానియందుండి లేదు. తస్మా
త్సవమస్తా అవిద్యోపాధి సాకారస్సావయవమేవ సకలావిద్యో
పాధి సాకారము సావయవమగును.

సావయవత్వా దవశ్యమనిత్యం భవేత్యేవ అవయవము
గల దేవ్వట అవశ్యము అనిత్యమేను. నోపాధిక స్సాకారో
వర్ణితః ఉపాధికరూపమని సాకారమని చెప్పబడ్డది.
తర్హిం: అట్లాగయితే నిరుపాధిక స్సాకారః కథమంత్రి నిరు
పాధిక సాకారమెట్టిది? నిరుపాధిక స్సాకారః త్రివిధః ని
రుపాధిక స్సాకారము త్రివిధములు బ్రహ్మవిద్యా సాకారశ్చా
నందః స్సాకారో భయాత్మకః సాకారశ్చేతి బ్రహ్మవి
ద్యా సాకారమనియు ఉభయసాకారమనియుం జెప్పబ
డెను. త్రివిధ స్సాకారోపి పునర్ద్వివిధో భవతి ఘ్రాం ర్త్యే
క్త సాకారము తిరిగి రెండు విధములుగాను నాయెను.
అనగా ఆ ~~ఆ~~ ఆయెను. నిత్య సాకారో ముక్తి స్సా
కారశ్చేతి బ్రహ్మవిద్యా నిత్యసాకారమనియు బ్రహ్మవిద్యా
ముక్త సాకారమనియు ఆనంద నిత్యసాకారమనియు
ఆనంద ముక్త సాకారమనియు ఉభయాత్మక నిత్యసా
కారమనియు ఇట్లాఱు విధములు నిత్య సాకారశ్చాద్యం
తశూన్యః నిత్య సాకారములు ఆద్యంతములు లేనిది.
శాశ్వతః కాలత్రయాబాధ్యము యున్నది. ఉపాసనయా
మేవ ముక్తింగతాః ఎవరు ఈ యుపాసన చేత ము
క్తినిబొందుదురో తేషాం సాకారః వారికిఁగల
స్వరూపము ముక్త సాకారమనబడును.

తస్యాఖండజ్ఞానేనావిర్భావో భవతి -ఆముక్తసాకారము
అఖండజ్ఞానముచేత పుట్టుచున్నది. నాపి అదియును
శాశ్వతః శాశ్వతము ముక్తసాకారస్యైవ సృష్టిరిత్యేవ
వదంతి ముక్తసాకారము సంకల్పప్రాప్తమగునని కొందఱు
చెప్పుదురు. శాశ్వతత్వం కథమితి దానికి శాశ్వతత్వ
మెట్లుగాను అద్వైతాఖండపరిపూర్ణ నిరతిశయపరమా
నంద శుద్ధబుద్ధ ముక్త సత్యాత్మక బ్రహ్మాద్వైతస్వ~~రూ~~
~~సాకారమగుటవలనను శాశ్వతమేను~~. తరత్వాత్ = ~~ఎ~~లా
~~నిరుపాధికసాకారస్య~~ ఇతి బ్రహ్మాద్వైతస్వమగు సాంకార
మగుటవలనను శాశ్వతమేను॥
నిరుపాధిక సాకారస్య నిత్యత్వం సిద్ధమేవ నిరుపా
ధికసాకారమునకు నిత్యత్వము స్వతస్సిద్ధమేను. త
స్మాదేవ అందువలననే నిరుపాధికసాకారస్య నిరవయవ
త్వాత్ నిరుపాధికసాకారము నిరవయవమని చెప్పఁబడెను.
సోపాధికమపి ఆకారం తేనా నిరస్తమేవ తనకంటెనధిక
మయినది లేకపోవుటచేతను నిరవయవం బ్రహ్మాద్వైతస్వమితి స
ర్వోపనిషత్సు సర్వశాస్త్రసిద్ధాంతేషు శ్రూయతే నిరవయవమే
బ్రహ్మాద్వైతస్వమని సర్వోపనిషత్తులయందును సర్వశాస్త్రసిద్ధాం
తములయందును వినఁబడుచున్నది. కాఁబట్టి
నిరుపాధికసాకారము బ్రహ్మాద్వైతస్వమనియు బ్రహ్మస్వారా

వైకుంఠమనియు శ్రీమన్నారాయణమూర్తి యనియుఁ దెలియఁ దగినది. అవిద్యాపాదమందుఁ గలది. ఉపాధిసాకారములు అవినశించునవి గానె యుండఁగదా అథవ మఱియు శిష్యుఁడడుగుచున్నాఁడు.

విద్యానందతురీయాణా మభేద ఏవ శ్రూయతే.

సర్వత్ర అంతటను విద్యాపాద ఆనందపాద తురీయపాదములకు అభేదమును వింటిమను. విద్యాదిసాకారభేదః కథమితి విద్యాదులకు సాకారభేదమెట్లుగాను. గురువు చెప్పుచున్నాఁడు. సత్యమేవోక్తమితి దేశికః పరిహరతి నిజమని పలికి సిద్ధాంతముచేతఁ బరిహరించుచున్నాఁడు. విద్యాప్రాధాన్యేన విద్యాసాకారః విద్యాతిశయముచేత విద్యాసాకారమనియు ఆనందప్రాధాన్యేన ఆనందసాకారః ఆనందాతిశయముచేత ఆనందసాకారమనియు ఉభయప్రాధాన్యేన ఉభయాత్మకసాకారశ్చేతి విద్యానందాతిశయముచేత ఉభయసాకారమనియుఁ జెప్పఁబడెను. ప్రాధాన్యకృతభేద ఏవ అత్ర ఇందు ప్రాధాన్యముచేతనే భేదముగాని వస్తుతత్త్వభేద ఏవ వస్తుతః భేదము లేదు. శిష్యుఁడడుగుచున్నాఁడు. భగవన్: అఖండాద్వైత పరమానందలక్షణ పరబ్రహ్మణస్సాకార నిరాకార విరుద్ధ ధర్మ విరుద్ధోభయాత్మకత్వం కథమితి: ఓస్వామీ ఇట్టి పరబ్రహ్మకు

సాకార నిరాకారములు విరుద్ధ ధర్మములు గలుగుట యెట్లుగాను అనిన గురువు జెప్పుచున్నాడు.

సత్యమేవేతి గురుః పరిహరతి : నిజమేయని గురువు సిద్ధాంతముచేత బరిహరించుచున్నాడు. యథా ఎట్లుగాను సర్వగతస్య బ్రహ్మాండమునందంతట సంచరించెడి నిరాకారస్య ఆకారములేని మహావాయోశ్చ పరిపూర్ణవాయువునకును తదాత్మకస్య ఆరూపమయియు తత్ప్రకృతిత్వేన ఆ అధిదేవతా రూపముగాను ప్రసిద్ధస్య ప్రసిద్ధమయిన సాకారస్య సాకారమయిన మహావాయుదేవస్య చ మహావాయుదేవునకును అభేదః అభేదము సర్వత్ర అంతట శ్రూయతే: వినబడుచున్నదో అలాగే యథా పృథివ్యాదీనాం ఎట్లు పృథివి మొదలగు వ్యాపకశరీరాణాం అంతట వ్యాపించియుండెడి భూమి మొదలగు భూతములకును దేవ విశేషాణాం చ ఆ భూతముల యొక్క అధిదేవతలకును తద్వ్యాలక్షణా ఆ భూతముల ~~యొక్క~~ కంటె వేఱయియుండెడియును తదిచ్ఛిన్న వ్యాపకా పరిచ్ఛిన్న ఆ భూతభేదములేక వ్యాపకరూపముల తోనెడ తెగకయుండునట్టి నిజమూర్త్యాకారపవ అధిదేవతాకారమే సర్వత్ర అంతట శ్రూయతే: వినబడుచున్నది. తద్వత్ : అలాగే పరబ్రహ్మణస్సర్వాత్మకస్య సాకార నిరాకార భేద విరోధ

మున్నే లేదు. వివిధ విచిత్రానంద శక్తేః పరబ్రహ్మణః
స్వరూపజ్ఞానేన విరోధో న విద్యతే నానావిధ విచిత్ర విచిత్ర
శక్తిగల పరబ్రహ్మము యొక్క యథార్థ స్వరూపము దెలియుట
చేత విరోధము న విద్యతే - లేదు. ఇతర ఏవ లక్ష్యగత
విరోధో విభాతి అట్టి పరిపూర్ణ బ్రహ్మజ్ఞానము లేక
యుండిన నానేక విరోధములు తోచును. ఇంకను మఱియు
రామకృష్ణాద్యవతారేష్వప్యద్వైత పరమానంద లక్షణబ్రహ్మ
పరమతత్త్వ పరమవిభవానుసంధానం క్రియమాణత్వేన శ్రూయ
తే సర్వత్ర. శ్రీమన్నారాయణమూర్తి యొక్క రామ
కృష్ణాద్యవతారములయందును అద్వైతపరమానంద
స్వరూపమయిన బ్రహ్మము యొక్క పరమతత్త్వ పరమవై,
భవానుసంధానము అంతట వినఁబడుచున్నది. సర్వపరి
పూర్ణస్య. అద్వైత పరమానంద స్వరూపుఁడయిన ఆ
యాదినారాయణ పరబ్రహ్మ విషయము యిట్లు చెప్పఁ
బడినది. అన్యథా అట్లు కానియెడల సర్వపరిపూర్ణస్య
పరబ్రహ్మణః పరమార్థతః సాకారం వినా కేవల నిరాకా
రత్వం యద్వ్యాఖ్యాతం తథా న సర్వపరిపూర్ణుఁడయిన పర
బ్రహ్మము యథార్థముగాను స్వరూపము లేని కేవల నిరాకా
రము చెప్పడమే మాంతం యుక్తమా యెన్నా అది మంచిది
కాదట్లనిన కేవల నిరాకారస్య గగనస్యేవ పరబ్రహ్మణోపి

రూపము పపద్యతే నిరాకారము గగనమునకు వలెను
పరబ్రహ్మకును జడత్వము సంభవించును. తస్మాత్ అధికా
రణము వలన పరబ్రహ్మణః పరమార్థత స్సాకారో నిరాకార
శ్చ స్వభావసిద్ధే పరబ్రహ్మకు పరమార్థమందు సాకార నిరాకా
రములు రెండును స్వభావసిద్ధములు.

ఇతి శ్రీమద ధర్వణ మహాకైవల్య నారాయణోప
నిషది ద్వితీయో ధ్యాయః.

వ. ఇట్లు బోధించిన విని శిష్యుండు గురుమహిమ నవలోకించి
భక్తియుక్తుంబుగ నిట్లనియె.

మ. గతజన్మంబుల జేసినట్టి విలసత్కల్యాణ యోగక్రియా
యుతమై వచ్చిన భాగ్యరేఖనుగదా యోగప్రతాపోదారుసం
తతతత్వామృత దానశీలు భవబంధ ధ్వాంసు నిర్గుణనిష్ఠునే
నతిమోదంబున గాంచగల్గె గురురాయా దీనచింతామణీ॥

గీ. అనుభవించితి ముక్తి హస్తగతమగుచు
బలికెనో యయ్య నీవిపుడెల్ల మనసువీడి
నట్టి ధర్వణ నారాయణాఖ్య శ్రుతిని
సాంతముగ దెల్పి బ్రోచితే సదయహృదయ.

క. శ్రీ సీతావరముర నర
కాసురమదహరణ శౌర్య హరసుతవర్యా
వ్యాసాది మునిగణార్చిత

వాసవముఖ దేవయక్షసిద్ధభవరక్షా.

క. జీవేశ్వర భేదాత్మక
జీవేశాక్షరరూప చతుర్ముఖమూర్తీ
భావన యోగనికేతన
పావన నిజనామమంత్ర పాలనకామా.

మాలినీవృత్తము. అజహరహరిరూపా వ్యక్తదైత్యేంద్రకోపా
భుజగరమణశాయీ యా శాంతిసౌఖ్యప్రదాయా
గజవర [illegible] కాంచనోదారచేలా
సుజనహృదయఖేలా! సోమసౌందర్యభాలా..

గద్య॥ ఇది శ్రీమద్రఘురామ చరణారవింద వందన సమాసాదిత కవితాధౌరేయ అత్తోటకులసాగరాత్రేయ రఘుపతిరాయామాత్య ప్రణీతంబయిన రఘుపతిరాయవ్యంబను వేదాంతకావ్యంబునందు కృత్యాదియును, గురుపరిచర్యావిధానఘట్టంబును, గురుకృపాలబ్ధ ఘట్టంబును ఆ సద్గురువ్యాపార లక్షణఘట్టంబును, గురుబోధాలోచన ఘట్టంబును, జీవదార్ఢ్యప్రమేయ ఘట్టంబును, గురుబోధారంభ ఘట్టంబును కర్మస్వరూప నిరూపణ ఘట్టంబును దైత్యాంశజన ప్రవర్తన నిరూపణ ఘట్టంబును దేవతాంశజులగుమనుజులసదాచార నిరూపణ ఘట్టంబును అభ్యాసయోగంబు చేఁగలుగు స్వేచ్ఛామరణ కాంక్షల విచార ఘట్టం

బును, మోక్షసామ్రాజ్య సాధన సంలక్షణ ప్రాయ ఘట్టం
బును, సర్వయోగోత్తమప్రచార ఘట్టంబును, మతాంతర
జన దుర్వాద విఖండన ఘట్టంబును, భక్తిస్వరూప నిరూపణ
ఘట్టంబును, భక్తిసార సంగ్రహ ఘట్టంబును, భక్తజన
చర్యావిధాన ఘట్టంబును, చతుర్విధ ముక్తివిచార ఘట్టం
బును, నారాయణ శబ్దార్థ విచారణ ఘట్టంబును, మం
త్రోద్ధారణ ఘట్టంబును, మంత్రోపదేశ ప్రాప్తి, మంత్రో
ద్భవ ఫలవిచార ఘట్టంబును, శ్రీమన్నారాయణ సర్వకార
ణత్వ సర్వమయత్వ సర్వేశ్వరత్వ సర్వపరిపూర్ణత్వ
నిత్యత్వాది విచారణ ఘట్టంబును, భగవదవతార ప్రమే
య ఘట్టంబును అనన్యశరణ్య భక్తజన ప్రచార ఘట్టం
బును సగుణ నిర్గుణ తారతమ్య విచార ఘట్టంబు నను
నిరువదియారు ఘట్టంబులతో దంగరండి
యీ ప్రథమాశ్వాసము ప్రకాశించెడిని.

సంపూర్ణము.

ఇయ్యది వంశాల దారశాన్వమయ్య పంతులుగారు.

Copied and compared with the original

Sd. M. Narasimayya

Transcribed from the Ms. of Mr. A. Lakshmi
Narayana Varaprasada Pantulu Garu, Clerk,
Taluk office, Tenali - in the year
1920-21.